"అత్యావసర పరిస్థితి - అనుశాసన పర్వం"

—ఆచార్య వినోబా భావే

# కొత్త లాభాలు

ప్రతి జాతీయ కార్యకలాప రంగంలో ప్రస్ఫుటమైన అభివృద్ధి

- అత్యావసర వస్తువుల ధరలు తగ్గాయి.
- ఉత్పత్తి పెరిగింది. మరింత విద్యుచ్ఛక్తి.
- పారిశ్రామిక సంబంధాలు మెరుగు పడ్డాయి.
- సమ్మెలు, లాకౌట్లు, బంద్‌లు అదృశ్యం
- నేరాలు, దౌర్జన్యం, ఇతర సమాజ వ్యతిరేక కార్యకలాపాలు ప్రస్ఫుటంగా తగ్గాయి.
- ఆఫీసులలో వేళలని పాటించడం, శక్తిసామర్థ్యాలు.
- ప్రజలు మరింతగా కష్టించి పనిచేస్తున్నారు.
- అధికనోట్ల పరిస్థితి రేటు 1974 ఏప్రిల్‌లో 30.1% ఉండగా, 1975 జులై 19వ తేదీ నాటికి –2.1%కి తగ్గింది.
- రైతులకి మరింతగా మెరుగైన వ్యవసాయ ఉత్పత్తి సాధనాలూ, ఋణ సదుపాయాలూ.
- ప్రభుత్వ పంపిణీ వ్యవస్థని కట్టుదిట్టం చేశారు.
- అన్నిరాష్ట్రాలకి తగినంతగా కిరసనాయిలు సప్లయి
- కంట్రోల్లు వస్త్రం ఉత్పత్తి 1974లో 100 మిలియను చదరపు మీటర్లు కాగా, ఈ ఏడాది 160 మిలియన్ చదరపు మీటర్లకి పెరుగుతుంది.
- ఏటా కొత్తగా 2.5 లక్షల మందికి వంటకి గ్యాస్ సౌకర్యం లభిస్తుంది.
- 117 అత్యవసర మందుల ఉత్పత్తి పెంచుతారు.
- చేరుకోడానికి కష్టమయిన, కొండ ప్రాంతాలలో సిమ్మెంటు, తక్కువ ధరకి లభిస్తుంది.
- మధ్య తరహా ఆదాయ వర్గాలవారికి పన్నుల మినహాయింపు.
- క్రమశిక్షణా భావం మరింతగా పెరిగింది.

శ్రీమతి ఇందిరా గాంధి ప్రకటించిన

## 20 అంశాల కార్యక్రమం

అమలు జరపడంలో సహాయ పడండి

కష్టించి పనిచేయండి, ఎక్కువ ఉత్పత్తి జరపండి, క్రమశిక్షణ కాపాడండి.






















నోరూరించే మనసుదోచే మైమరపించే

పార్లే పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో—
రాస్ప్‌బెరీ, అనాస, నిమ్మ,
నారింజ, మోసంబి!

everest/981/pp-tl

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ ["ప్రత్యక్ష సాక్ష్యం]" తోకల వసుంధరాదేవి రచన. ఈ కథలో చక్కని నీతి ఉన్నది. ధర్మానికీ, నీతికీ కట్టుబడిన వాళ్ళు స్వార్థానికి కట్టుపడటం సాధ్యం కాదు. మనం చిక్కులలో ఉన్నప్పుడు మనని ఆదుకునే వాళ్ళు నీతిపరులూ, ధర్మపరులూ కాకపోవచ్చు. వాళ్లు మన స్వార్థాన్ని ఆధారం చేసుకుని, తమ అధర్మాలకు అడ్డంపెట్టుకోవచ్చు. అలా చాలామంది స్వార్థం కోసం అధర్మాలకు ఒడబడటంకద్దు.

సంపుటి 60 ఏప్రిల్ '76 సంచిక 4





## 34

బోయవాడు వెళ్ళిపోగానే చిత్రగ్రీవం తన అనుచరులతో, ''పాపిష్ఠి బోయవాడు వదిలిపోయాడు. ఇక మనం నిశ్చింతగా మహిళారూప్యానికి పోదాం. ఆ నగరానికి ఉత్తర ప్రాంతంలో నాకు స్నేహితుడైన హిరణ్యకం అనే ఎలుక ఉన్నది. అది మన ఉచ్చులన్నీ కొరికేసి మనకు స్వేచ్ఛ ఇస్తుంది. ఆపదలో స్నేహితులు తోడ్పడ వలసిందే గాని ఇతరులు 'అయ్యోపాపం!' అని కూడా అనరు,'' అన్నది.

చిత్రగ్రీవం దారితీయగా పావురాలన్నీ హిరణ్యకం అనే ఎలుక ఉండే బిలం వద్దకు ఎగిరి వెళ్ళాయి. పావురాలరాజు బిలద్వారం వద్ద నిలిచి, ఎలుగెత్తి పిలుస్తూ, ''మిత్రమా, హిరణ్యకా! త్వరగా రా. నాకు గొప్ప ఆపద సంభవించింది,'' అన్నది.

ఈ కేక విని, హిరణ్యకం బిలం లోపలనే ఉండి, ''ఎవరు నువ్వు? ఇక్కడికెందుకు వచ్చావు? నీకు వచ్చిన ఆపద ఏమిటి? అంతా విశదంగా చెప్పు,'' అన్నది. చిత్రగ్రీవం ఇలా అన్నది:

''నేను పావురాల రాజును, చిత్రగ్రీవాన్ని! నీ మిత్రుణ్ణి! త్వరగా రా. నాకు నీ సహాయం వెంటనే కావాలి.''

ఈ మాట విని హిరణ్యకం మిత్రుణ్ణి చూసే ఆనందంతో బయటికి వచ్చి, తన మిత్రుడూ, అతని అనుచరులూ ఉచ్చులలో చిక్కుకుని ఉండటం చూసి దుఃఖిస్తూ, ''ఏమిటిది?'' అని అడిగింది.

దానికి చిత్రగ్రీవం ఇలా అన్నది:

''ఎందుకు అడుగుతావు? గ్రహించలేవా? పూర్వజన్మలో చేసుకున్న దుష్కృతం కొద్దీ విధి రకరకాల పనులు

అట్ట చివరి బొమ్మ

చేయిస్తుంది. జిహ్వాచాపల్యం కారణంగా ఈ విపత్తు తెచ్చుకున్నాం.''

హిరణ్యకం ఇలా అన్నది :

''పక్షి నూరుమైళ్ళ దూరాన ఉన్న ఆహారాన్ని చూడగలదుగాని కళ్ళఎదటనే ఉన్న వలను చూడలేదు. అయినా విధి బలీయమనే నిర్ణయానికి నేను వచ్చాను. ఏ మంటావా ? మహా బలవంతులైన సూర్యుడూ, చంద్రుడూ రాహువుకు చిక్కుతున్నారు కారా ? మదించిన ఏనుగులూ, క్రూర విష సర్పాలూ, గాలిలో ఎగిరే పక్షులూ మనిషికి దొరికిపోవటం లేదా ? ఎక్కడ జీవించినా ప్రాణులను మృత్యువు పట్టుకుపోతూనే ఉన్నది.''

ఇలా అని హిరణ్యకం పక్షుల బంధాలను కొరకనారంభించింది.

అప్పుడు చిత్రగ్రీవం హిరణ్యకంతో, ''మిత్రమా, ముందు నా ఉచ్చులు కొరకకు. నా అనుచరులను విడిపించి, తరవాత నన్ను విడిపించు,'' అన్నది.

''అది అర్థంలేనిమాట. యజమాని తరవాతనే అనుచరులు,'' అన్నది హిరణ్యకం.

"మిత్రమా, అలా అనకు. వీళ్ళు, పాపం, నా పైన ఆధారపడి ఉన్న అభాగ్యులు ; తమతమ వాళ్ళను వదిలి, నా వెంట వచ్చినవాళ్ళు. నేను వాళ్ళపట్ల



ఈ మాత్రం శ్రద్ధచూపవద్దా ? రాజు ఎంత పేదవాడైనా తన సేవకులపట్ల శ్రద్ధచూపేవాడైతే, వాళ్ళు అతన్ని విడవరు. అది అలా ఉంచి, ఇన్ని బంధాలు కొరకటంలో నీ పళ్ళు విరిగిపోవచ్చు. లేదా, ఆ బోయవాడు నా అనుచరులు విముక్తి పొందేలోపుగా తిరిగి రావచ్చు, అప్పుడు నాకు నరకం సంప్రాప్తమవుతుంది. తన అనుచరులు కష్టాలలో ఉండగా తాను సుఖాలు అనుభవించిన నాయకుడు చచ్చి నరకానికి పోతాడు,'' అన్నది చిత్రగ్రీవం.

దానికి హిరణ్యకం ఇలా అన్నది :

"మిత్రమా, రాజుల విధులు నాకూ తెలుసు. నేను నిన్ను పరీక్షించటానికే

అలా అన్నాను. నువు పరీక్షలో నెగ్గావు. ఇంకా అనేకవేల పావురాలకు నువు రాజు కాతగుదువు. తన కింది వాళ్ళపై దయా దాక్షిణ్యాలు గల రాజు మూడు లోకాలనూ పాలించగలడు. నేను నీ అనుచరులను బంధవిముక్తులను చేస్తాను.''

ఇలా అని హిరణ్యకం పావురాలన్నిటినీ బంధ విముక్తుల్నిచేసి, చిత్రగ్రీవంతో, ''మిత్రమా, ఇక మీరు స్వేచ్ఛగా మీ చోటికి వెళ్ళిపొండి. మరొక సారి ప్రమాదం సంభవించినప్పుడు నా వద్దకు రావటానికి సంకోచించ వద్దు,'' అని చెప్పి, తన బిలంలోకి వెళ్ళిపోయింది.

చిత్రగ్రీవం తన అనుచరులతో సహా తిరిగి వెళ్ళింది.

ఇదంతా కళ్ళారా చూసిన లఘుపతనకం అనే కాకి తనలో, ''ఆహా, ఈ హిరణ్యకం ఎంత మంచిది! ఎంత వివేకం గలది! నేను మాత్రం విధిని ఒంటరిగా జయించగలనా? నేను కూడా ఈ ఎలుకతో స్నేహం చేసుకుంటాను. అనంతమైన సముద్రం కూడా తన మిత్రుడైన చంద్రుడి సహాయంవల్ల గదా పైకి లేస్తుంది!'' అనుకున్నది.

అది హిరణ్యకం ఉండే బిలం వద్దకు వెళ్ళి, చిత్రగ్రీవం గొంతుతో, ''ఏయ్, హిరణ్యకా! ఏమోయ్!'' అని పిలిచింది.

ఈ కేక వినగానే, తాను చిత్రగ్రీవం బంధాలు కొరకటం మరిచిపోయానేమో నని అనుమానం తగిలి, హిరణ్యకం తన బిలం నుంచే, "ఎవరది?'' అని అడిగింది.

''నేను లఘుపతనకం అనే కాకిని,'' అన్నది కాకి.

ఈ మాట వినగానే హిరణ్యకం తన బిలంలోకి మరింత దూరం వెళ్ళి, ''ఇక్కడి నుంచి వెంటనే వెళ్ళిపో!'' అన్నది.

దానికి కాకి, ''నన్నెందుకు పొమ్మంటున్నావు? నేను అతిముఖ్యమైన పని మీద వచ్చాను,'' అన్నది.

''నీకూ, నాకూ పొత్తు క్షేమకరం కాదు,'' అన్నది హిరణ్యకం.



# మీ పిల్లలకి కాల్షియం-శాండోజ్ ఎందుకు ఇవ్వాలి?





## 32 గట్టి పళ్ల కోసం. పటిష్టమైన ఎముకల కోసం!

పిల్లల యొక్క పళ్ళూ, ఎముకలూ పెరగటానికి పెద్దలకన్న రెట్టింపు కాల్షియం కావాలి. అందుకే పిల్లలకు రోజుకు కమ్మని, రాస్ప్‌బెరీ రుచిగల కాల్షియం-శాండోజ్ 4-6 బిళ్ళలు యిస్తే చాలు, పళ్ళు గట్టిబడి ఎముకలు పటిష్టమవుతాయి. దానితోబాటు వాళ్ళకు విటమిన్ సి, డి, బి12 కూడా అందుతుంది.

ముఖ్య విషయం: కాల్షియం-శాండోజ్‌లో, మీ శరీరం బాగా ఉపయోగించుకుంటుందని డాక్టర్లు చెప్పే కాల్షియం గ్లూకోనేట్ ఉంది.

**పెరుగుదలకు కాల్షియం**
కాల్షియం తీసుకున్న పిల్లలు, కాల్షియం తీసుకోని వారికన్నా 4 నెలలలో చాలా ఎక్కువగా ఎదిగారని శాస్త్రీయ పరిశోధనే రుజువు చేసింది.




**కాల్షియం-శాండోజ్®**

ప్రతి రోజు ప్రతివారికి

dCA/CS/14 A TEL.



# రాజు, మాట్లాడే ఒంటె



అనగనగా రాజు అని రంగులు వేయడం అంటే ఎంతో సరదాపడే చిన్న పిల్లాడుండేవాడు. కాని వాళ్ళ అమ్మ మాత్రం, నీళ్ళతో ఇల్లంతా చిందరవందర చేసేస్తాడని, అతనికి వాటర్ కలర్స్ ఇచ్చేది కాదు.

ఓ రోజున రాజు తన బొమ్మల పుస్తకంలో ముచ్చటైన ఓ ఒంటె బొమ్మని చూసాడు.

"నాకీ ఒంటె బొమ్మని గీయాలనుంది ఎలాగబ్బా" అని రాజు అనుకుంటూంటే.

ఉన్నట్టుండి పుస్తకంలో వున్న ఆ ఒంటె బొమ్మ మాట్లాడేసింది.

"దాందేముంది, నా బొమ్మని గీయొచ్చుగా ఎంచక్కా" అంది.

"దేంతో?" అడిగాడు రాజు.

"కేమెల్ వ్యాక్స్ క్రేయాన్స్‌తోనూ, ఆయిల్ ప్యాస్టెల్స్‌తోనూ"

"మరి నీళ్ళొద్దేంటి" అడిగాడు రాజు.

"అస్సలక్ఖర్లేదు". ఒంటె చెప్పింది. "అలా పెట్టెలోంచి తీసి చేత్తో గీసెయ్యడమే. అందులో బోలెడన్ని రంగులు".

ఇప్పుడు రాజు దగ్గర వున్న కేమెల్ వ్యాక్స్ క్రేయాన్స్, కేమెల్ ప్యాస్టెల్స్ అతనివే. అతనింత దాకా ఓ ఒంటె, ఓ ఎలుగుబంటి, ఓ కాకు, ఓ గుఱ్ఱం, ఓ చెట్టు బొమ్మల్ని గీసాడు.







# కేమెల్
## వ్యాక్స్ క్రేయాన్స్ మరియు ఆయిల్ ప్యాస్టెల్స్

కేమ్లిన్ ఉత్పాదనలలో ఎన్నెన్నో పక్షుల బొమ్మలున్న ఆకర్షణీయమైన స్టిక్కర్స్.

కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,
ఆర్ట్ మెటీరియల్ డివిజన్,
జె.బి. నగర్,
బొంబాయి 400 059.





Vision 764 Tel




# మాయా సరోవరం

## 4

[నగర రక్షణాధికారి వెంట జయశీలుడూ, సిద్ధసాధకుడూ, కాటికాపరి కొడుకూ హిరణ్యాపుర మంత్రి దగ్గరకు వెళ్ళారు. మంత్రి వాళ్ళ సంగతి రాజుతో చెప్పేందుకు వెళ్ళిన సమయంలో, మంగళవర్మ అనేవాడు అపూర్వశక్తులు గల కత్తిని తాను పరీక్షిస్తానన్నాడు. రాజాజ్ఞ కాగానే అతని మీదికి బోనుల్లో నుంచి పులులు వదలబడినై. తరవాత—]

సేనాని కొడుకు మంగళవర్మ ఖడ్గ, ధనుర్విద్యల్లాంటి వాటిని బాగా నేర్చిన వాడే. కాని, రెండు పులులు నోళ్ళుతెరిచి, కోరలుచాచి, గర్జిస్తూ తన కేసి రావటం చూస్తూనే, అతడికి ఎక్కడలేని భయం పట్టుకున్నది. అతడు వెనకకు రెండడుగులు వేసి, ఎగిరి ప్రాకారం ఎక్కి ప్రాణాలు కాపాడుకునేందుకు మార్గమేమైనా ఉన్నదా అని, తల ఎత్తి చూశాడు. వెంటనే పులుల్లో ఒకటి గట్టిగా ఖాండ్రించి, అతడి మీదికి దూకేందుకు ముందు కాళ్ళు రెండూ ఎత్తింది.

మంగళవర్మ భయకంపితుడయాడనీ, ఆ భయంవల్ల కనీసం ఆత్మరక్షణకైనా కత్తిని ఉపయోగించలేకపోవచ్చునీ, అనుమానించిన జయశీలుడు, ప్రాకారంపై నుంచి, "మంగళవర్మా! నీ చేతిలోనిది అమోఘశక్తులుగల ఖడ్గం. భయపడకు!



ఒక్కొక్క దెబ్బకు, ఒక్కొ పులిని హత మార్చు,'' అని కేకపెట్టాడు

ఆ హెచ్చరికతో మంగళవర్మకు తిరిగి ధైర్యం కలిగింది. తన చేతిలో వున్నది, అపూర్వశక్తులుగల కత్తి!....ఆ మాట చెప్పినవాడు, యిప్పుడు తనను హెచ్చరించిన, జయశీలు డనేవాడు. ఒకవేళ నిజంగా కత్తిలో అలాంటి మహత్తర శక్తులు లేకపోతే....

మంగళవర్మకు యిలాంటి సంశయం కలగ్గానే, అతడి చేయి వణికింది. మరుక్షణం పులుల్లో ఒకటి అతడి మీదికిదూకి పంజాతో అతడి భుజం మీద ఒక దెబ్బ కొట్టింది. ఆ దెబ్బ తింటూనే మంగళవర్మ గట్టిగా అరిచి, తన కెలాగూ చావు తప్పదన్న తెగువతో కత్తి ఎత్తి పులిని గుండెల్లో పొడవబోయాడు. కాని గజగజ వణుకుతున్న అతడి చేతి నుంచి కత్తి జారి కింద పడింది.

ఇది చూసి కనకాక్షరాజూ, మంత్రీ నిలువెల్లా కంపించిపోయారు. పులులు రెండూ నాలుగడుగులు వెనక్కు వేసి, మంగళవర్మ మీదికి కుప్పించి దూకేందుకు తోకలల్లాడిస్తూ, పంజాలతో నేల దువ్వసాగినై. మంగళవర్మ ప్రాకారం గోడకు అనుకుని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

''వీరయువకా, జయశీలా!'' అంటూ అరిచాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడి మాటలు ముగిసే లోపలే జయశీలుడు, పెద్దగా చప్పట్లు చరుస్తూ, పదడుగుల ఎత్తున్న ప్రాకారం మీది నుంచి, పిడుగుపాటులా పులుల ముందుకు దూకాడు. హఠాత్తుగా తమ ముందుకు వచ్చి పడిన ఆకారం ఏమిటో చప్పున గుర్తించలేక, పులులు రెండూ; ఇలాంటి సమయాల్లో ప్రాణికి కలిగే సహజమైన భీతి కొద్దీ, పక్కలకు పరిగెత్తాయి. అదే అదనుగా జయశీలుడు కిందపడి వున్న కత్తిని చేతికి తీసుకున్నాడు.

కనకాక్షరాజు అబ్బురపడిపోతూ, తన మంత్రి కేసి తల తిప్పి, "మహామంత్రీ! ఎంత సాహసం! ఏమి ధైర్యం! ఇలాంటి యువకుడి సాయం వుంటే, యువరాజూ, యువరాణీ తిరిగి మనకు లభించే అవకాశం వున్నది," అన్నాడు.

"మహారాజా, ముందు అతణ్ణి ప్రాణాలతో బయట పడనివ్వండి. పులులు రెండూ ఒకేసారి అతడి మీదికి లంఘించేలా వున్నవి!" అన్నాడు మంత్రి ధర్మమిత్రుడు.

పులులు రెండూ ఒకేసారి తన మీదికి దూకే ప్రయత్నంలో వున్నవని గ్రహించిన జయశీలుడు, నేలను కాళ్ళతో గట్టిగా ఒకసారి తాటించి, "ఏయ్‌ఁ!" అంటూ అరిచి, ప్రాకారం గోడ కేసి పారిపోతున్న వాడిలా, పక్కకు నాలుగడుగులు వేశాడు. దానితో పులుల్లో ఒకటి రెచ్చిపోయి, పెద్దగా గర్జిస్తూ అతడి కేసి పరిగెత్తింది. పులి యింకా రెండడుగుల దూరంలో వుండగానే, జయశీలుడు కత్తి చాచి, దాని తల మీద మెరుపు వేగంతో బలంగా కొట్టాడు.

పులి ఆ దెబ్బకు దిమ్మ తిరిగి, పక్కకు పడబోయినదల్లా, అంతలోనే తేరుకుని భయంకరంగా గర్జించి, జయశీలుడి మీదికి దూకేందుకు వెనక కాళ్ళ మీద లేచింది. జయశీలుడు యీ సారి ముందుకొక అడుగు వేసి, పులి గుండెల్లో కత్తిని బలంగా గుచ్చాడు.





పోయి కోపంగా గుర్రుపెడుతున్న పులి కేసీ ఓ మారు చూసి, తల పైకెత్తి, కనకాక్ష రాజుతో, ''మహారాజా! ఈ కత్తికి అమోఘశక్తులున్న మాట నిజం! దురదృష్ట వశాత్తూ, అది నా చేతి నుంచి జారి కింద పడింది. అందువల్ల దాని శక్తిని నేను నిర్ణయించ లేకపోయాను; జయశీలుడు ఆ పని చేశాడు," అన్నాడు.

''లెస్స పలికావు, మంగళవర్మా! అదృష్టవంతుడివి. భుజంమీద తగిలింది చాలా స్వల్ప గాయంలా వుంది,'' అంటూ మంత్రి ధర్మమిత్రుడు హేళనగా నవ్వాడు.

''నేను ముందే చెప్పాను. ఆ కత్తిని కాలకాలుడు స్వయంగా దీవించి, జయశీలుడి కిచ్చాడు. దానితో అతడీ ప్రపంచాన్నే జయించగలడు,'' అన్నాడు సిద్ధ సాధకుడు పరమానంద భరితుడైపోతూ.

''కాని, అంత శక్తులు గల కత్తీ, మంగళవర్మ చేతిలో వుండగా పులిని కూడా చంపలేకపోయింది!'' అన్నాడు కనకాక్షరాజు చిరాకుపడుతున్నట్టు.

అంతలో మంత్రి ధర్మమిత్రుడు ప్రాకారంమీది నుంచి వంగి, చేయి చాచి, జయశీలుడితో, ''జయశీలా! ఇక పైకి రా! నీ ధైర్య సాహసాలనే కాక, మా సేనాని కుమారుణ్ణి ప్రాణాపాయం నుంచి రక్షించినందుకూ్కడా అభినంది

పులి ఖాండ్రిస్తూ వెనక్కు పడిపోయి గిలగిలా తన్నుకోసాగింది. ఇదంతా క్షణాల మీద జరిగిపోయింది. కింద పడి పొర్లుతున్న తన తోటి పులిని చూస్తూనే రెండవ పులి తల వంచి, గ్రుర్రున ఒక గిరికీ కొట్టి, కత్తి చాచి తన కేసి వస్తున్న జయశీలుణ్ణి చూసి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, బాణంలా తెరిచి వున్న బోనులోకి పోయి పడింది.

ప్రాకారం పై నుంచి ఒక్క పెట్టున కనకాక్షరాజుతో పాటు అందరూ హర్ష ధ్వానాలు చేశారు. మంగళవర్మ అప్పటి గ్గాని మూసిన కళ్ళు తెరవలేదు. అతడు చచ్చి పడివున్న పులి కేసీ, బోనులోకి

స్తున్నాను. సేనాని ప్రస్తుతం నగరంలో లేడు; సరిహద్దుల రక్షణ ఎలా వున్నదో పర్యవేక్షించేందుకు వెళ్ళాడు. ఆయన తిరిగి వచ్చి, తన కుమారుడు పులివాత పడ్డాడని వింటే, చాలా విచారపడేవాడు." అన్నాడు.

ఆ మాటలకు కనకాక్షరాజు చిన్నగా నవ్వుకుని, ప్రాకారంమీది నుంచి తనూ మంత్రితో పాటు దిగువకు చేయి జార్చి, "జయశీలా! మా యిద్దరి చేతుల ఆధారంతో పైకి రాగలవా?" అన్నాడు.

"అదేమంత కష్టం కాదు, మహారాజా! కాని, ముందుగా పులి వున్న బోనును మూయించటం క్షేమం. నేను పైకి వస్తే, మంగళవర్మ నిరాయుధుడుగా ఒక్కడే యిక్కడ వుండిపోవలసి వస్తుంది," అన్నాడు జయశీలుడు.

"ఆయన చేతుల్లో ఆయుధం వున్నా; నిరాయుధుడి కిందే లెక్క. ఆఖరికి ఇంద్రుడి వజ్రాయుధమైనా, దాన్ని పట్టినవాడు పారుబోతైతే, పూచికపుల్ల కిందే జమ!" అన్నాడు సిద్ధసాధకుడు.

కనకాక్షరాజూ, మంత్రి ధర్మమిత్రుడూ చాచిన చేతుల్ని పట్టుకుని జయశీలుడు ప్రాకారం మీదికి పోయాడు. మంత్రీ, రాజూ అతణ్ణి భుజం తట్టి ఎంతగానో అభినందించారు. సిద్ధసాధకుడు, అతణ్ణి



గట్టిగా కావిలించుకుని, "జయశీలా, నువు గుండెలు తీసిన బంటువు! నువు, నాకు మహాకాలుణ్ణి వశపరుచుకునేందుకు సాయపడటమే గాక, మహారాజుకు, వారి కుమారుణ్ణీ, కుమార్తెనూ తెచ్చేందుకు తోడ్పడగలవు కూడా," అన్నాడు.

"సాధకుడా, ఆ సంగతులన్నీ మహారాజుగారు భవనానికి వెళ్ళిం తరవాత మాట్లాడతారు. నువు కొంచెం ఆగు," అని మంత్రి ధర్మమిత్రుడు దూరంగా ఉన్న సేవకులను కేకవేసి పిలిచి, వాళ్ళకు మంగళవర్మను పైకి తెచ్చి, అతడి గాయానికి చికిత్స చేసే ఏర్పాటు చేయమని అజ్ఞాపించాడు.



రాజు వెంట అందరూ భవనం కేసి బయలుదేరగానే, మృగశాలాధికారి పులి వున్న బోనును మూసి, అవమానభారంతో కుంగిపోయి, దిక్కులు చూస్తున్న మంగళవర్మ దగ్గిరకు వచ్చి, అతడి భుజం మీది గాయాన్ని పరీక్షించి చూసి, "అయ్యా, ఇదేమంత ప్రమాదకరమైన గాయంకాదు, వారం రోజుల్లో మాని పోతుంది. కాని, ఆ జయశీలు డనే కుర్రాడు మృగశాలలో అన్నిటికన్నా ఉత్తమ జాతిదైన పులిని చంపాడు. దాన్ని అరణ్యంలో నేను పట్టుకోబోయినప్పుడు, నా సేవకుల్ని యిద్దర్ని చంపిగాని, నాకు స్వాధీనం కాలేదు." అన్నాడు చచ్చిన పులి దగ్గిర, మోకాళ్ళమీద వంగి కూర్చుని కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ.

"చచ్చుపులి, చచ్చినందుకు అంతగా దుఃఖపడకు. ఆ జయశీలుడి కత్తిలో నిజంగానే అమోఘ శక్తులున్నవంటావా?" అని అడిగాడు మంగళవర్మ.

ఆ మాటలకు మృగశాలాధికారి కోపం తెచ్చుకుని, అయినా సేనానికొడుకు గనక దాన్ని బయటికి కనబరచకుండా, చిన్నగా పళ్ళుకొరికి, "అయ్యా, ఆ కత్తికున్న శక్తులమాట నాకు తెలియదు. కాని, ఒకటి మాత్రం నిజం: ఆ కత్తి మాంచి పదునైనది, వాడినవాడు చేవగలవాడు," అన్నాడు.

"అయితే, వాడికి అర్ధరాజ్యం, రాజకుమార్తె కూడా లభ్యపడే అవకాశం వుంది, ఏం చేయాలి?" అంటూ మంగళవర్మ గొణుక్కోసాగాడు.

మంత్రి పంపిన సేవకులు నలుగురు వచ్చి, మంగళవర్మను చేతులు పట్టుకుని, ప్రాకారం మీదికి తీసుకుపోయారు. అతడు రాజభవనం కేసి ఓమారు దిగులుగా చూసి, "ఒరే, పులిని చంపిన ఆ యువకుడికి రాజుగారేమైనా బహుమానం యిచ్చి పంపారా? లేక యువరాజునూ, యువరాణినీ వెతికేందుకు వెళ్ళమన్నారా?" అని అడిగాడు.

"అయ్యా, ఆ సంగతు లేవీ మాకు తెలియవు. అందరూ భవనంలోకి పోతు న్నారు. కాటికాపరి కొడుకు మాత్రం, వాకిలి దగ్గిరే నిలబడి వున్నాడు." అన్నా డొక సేవకుడు.

అంతలో కాటికాపరి కొడుకు పెద్దగా గొంతెత్తి, "మహాప్రభో! చచ్చిబతికిన, నా తండ్రిని చంపినాయన్నుంచి, నాకే దైనా నష్టపరిహారం అయినా యిప్పిం చండి," అని కేకపెట్టాడు.

ఆ కేక విని మంత్రి ధర్మమిత్రుడు వెనక్కు తిరిగి చూసి, రాజుతో ఏదో మాట్లాడి, కాటికాపరి కొడుకుతో, "ఒరే, తండ్రి పోయినందుకు దిగులుపడకు. మహారాజుగారు నిన్ను, మొత్తం నగరం లోని వల్లకాడులూ, శ్మశానాల మీద పర్య వేక్షణాధికారిగా నియమించారు. జీతం యిప్పుడు నీకు ముట్టుతున్న దానికి నూరంతలు ఎక్కువ యిస్తారు. ఇక గొడవ చేయక పో," అన్నాడు.

"ప్రభో, చచ్చేవరకూ మీ మేలు మరవను. మా అయ్య చచ్చినందుకు ఒక దిగులు; బతికి మళ్ళీ వచ్చినందుకు మరొక దిగులు. ఆయనే బతికుంటే, యిప్పటి నా పదవిచూసి ఎంత సంతోషించే వాడు!" అన్నాడు కాటికాపరి కొడుకు, కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.



మంత్రి ధర్మమిత్రుడు చిన్నగా నవ్వుకుని. "ఇక వెళ్ళు," అని కాటికాపరి కొడుకుతో చెప్పి, రాజూ, జయశీలుడూ, సిద్ధసాధకులతో పాటు, భవనం లోపలికి వెళ్ళిపోయాడు.

కనకాక్షరాజు ఒక ఉన్నతాసనం మీద కొంచెం సేపు ఆలోచిస్తూ కూర్చుని, తర వాత మంత్రితో; "మహామంత్రీ! యిప్పుడేం చేద్దామంటారు? యువరాజునూ, యువ రాణినీ వెతికి తెచ్చే ప్రయత్నంలో మన వాళ్ళందరూ విఫలులయారు. ఆ భారం ధైర్యవంతుడూ, శక్తిమంతుడూ అయిన, యీ జయశీలుడి పైన పెట్టటం ఎలా వుంటుంది?" అన్నాడు.

మంత్రి, జయశీలుడి కేసి ఓ మారు చూసి, ఏదో చెప్పబోయేంతలో సిద్ధసాధకుడు ఆవేశపడిపోతూ, ''దివ్యంగా వుంటుంది, మహారాజా! తమ పిల్లల్ని వెతికి తెచ్చేందుకు ఒక్క ధైర్యమూ, శక్తిసామర్థ్యాలూ మాత్రమే చాలవు; వాటితోపాటు అలౌకికజ్ఞానం కూడా వుండాలి. అందువల్ల జయశీలుడితో వెళ్లేందుకు, నాకూ అనుమతియివ్వండి,'' అన్నాడు.

జయశీలుడు అయిష్టంగా తలాడించి, ''మహారాజా, నా దొక మనవి!'' అన్నాడు.

''ఏమిటో చెప్పు. నీ అభిప్రాయం ఎలా వున్నదో వినాలనుకుంటున్నాను,'' అన్నాడు కనకాక్షరాజు.

''మహారాజా, నేను ఉన్న దేశం వదిలి, బతుకుతెరువుకు తమ దగ్గిర ఏదైనా చిన్న ఉద్యోగం దొరుకుతుందేమో అని వెతుక్కుంటూ వచ్చిన వాణ్ణి. అలాంటి దేదైనా యిస్తే, కృతజ్ఞుణ్ణయి వుంటాను,'' అన్నాడు జయశీలుడు.

కనకాక్షరాజు, మంత్రి కేసి సాభిప్రాయంగా చూశాడు. మంత్రి, జయశీలుడితో, ''మహారాజుగారు, నీకు ఉద్యోగం యిచ్చి, తమ భృత్యుల్లో ఒకడుగా చేర్చుకున్నారు. రాజాజ్ఞ పాలించటం భృత్యుడి ధర్మం గదా?'' అన్నాడు.

''ధర్మం ఒక్కటేకాదు, విధి కూడా. ఆజ్ఞాపించండి!'' అన్నాడు జయశీలుడు.

మంత్రి ధర్మమిత్రుడు తృప్తిగా తలాడించి, ''జయశీలా, నిన్ను యువరాజూ, యువరాణులను వెతికేందుకు పోవలసిందిగా మహారాజుగారు ఆజ్ఞాపిస్తున్నారు,'' అన్నాడు.

అంతలో రాజుగారి సేవకు డొకడు ఒక ముత్యాలహారాన్ని, సగం విరిగిన కత్తి నొకదాన్ని అక్కడికి తీసుకువచ్చి, ''మహారాజా, ఇవి యువరాజూ, యువరాణీ కనిపించకుండాపోయిన చెట్టు దగ్గిర ఒక బోయవాడికి దొరికాయి. వాడు మతిపోయిన స్థితిలో పడి వున్నాడు,'' అని చెప్పాడు. —(ఇంకావుంది)





# ప్రత్యక్ష సాక్ష్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనిషి బుద్ధి నిలకడ లేనిది. మంచి బుద్ధి క్షణంలో చెడి పోవచ్చు; అలాగే దుర్బుద్ధి కూడా ఏ కారణమూ లేకుండానే మంచిగా మారవచ్చు. అందుకు నిదర్శనంగా నీకు ప్రసూనుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కౌశాంబీ నగరంలో ప్రసూనుడు ధనిక కుటుంబంలోనే పుట్టాడు, కాని గ్రహ చారం బాగులేక అతని వ్యాపారం దెబ్బ తిని, అప్పుల పాలై, అతను తన భార్యనూ, బిడ్డలనూ కూడా పోషించుకో లేని స్థితికి వచ్చాడు. అదే నగరంలో ఉండే వర్తక

బేతాళ కథలు



ప్రముఖుడు దీపకుడు అనేవాడు ప్రసూనుడి స్థితికి జాలిపడి, సాటివాడన్న సానుభూతితో అతన్ని తన ప్రధాన లేఖకుడుగా పెట్టుకుని పోషిస్తూవచ్చాడు.

ఇలా ఉండగా ఒకనాడు దీపకుడి ఇంట దొంగతనం జరిగింది. దీపకుడు తన సేవకుణ్ణి ఒకణ్ణి అనుమానించి, వాడి చేత నిజం చెప్పించటానికి చావుదెబ్బలు కొట్టాడు. ఆ దెబ్బలకు వాడు అక్కడే చచ్చిపోయాడు. తన నేరాన్ని కప్పిపుచ్చుకునేటందుకు దీపకుడు తన కింద పనిచేసే మైనాకుడు అనే వాడి మీద హత్యానేరం మోపాడు. ఇదంతా జరిగినప్పుడు ప్రసూనుడు అక్కడే ఉన్నాడు.

రాజభటులు వచ్చి మైనాకుణ్ణి పట్టుకుపోయారు. అతన్ని ఖైదులో ఉంచినప్పుడు మైనాకుడు తాను నిర్దోషిననీ, ప్రత్యక్షంగా అంతా చూసిన ప్రసూనుడికి ఆ విషయం తెలుసుననీ అన్నాడు.

తన భవిష్యత్తు ప్రసూనుడి సాక్ష్యం మీద ఆధారపడుతుందని దీపకుడు గ్రహించాడు. అతను ప్రసూనుడితో, తాను నిర్దోషి అని సాక్ష్యం చెప్పేపక్షంలో అతనికి స్వతంత్రంగా వర్తకం చేసుకోవటానికి చాలినంత మూలధనం ఇస్తానని ఆశ పెట్టాడు. అందుకు ప్రసూనుడు వెంటనే అంగీకరించాడు.

అయినా ప్రసూనుడి మీద ఎందుకో దీపకుడికి నమ్మకం కలగలేదు. అతను ఒక సేవకుణ్ణి ప్రసూనుడి ఇంటికి పంపి, వాడి ద్వారా అతన్ని పరీక్షచేయించాడు.

ఆ నౌకరు ప్రసూనుడి వద్దకు వెళ్ళి, "బాబూ, తమరు మైనాకుడి మీద అబద్ధపు సాక్ష్యం చెప్పుతారా? అలా చెయ్యటం పాపం కాదా? పాపం, మైనాకుడికి మరణ దండన పడితే అతని భార్యా, పిల్లలూ ఏమవుతారు?" అన్నాడు.

"పాపపుణ్యాల మాట నాకెందుకు! దీపకుడు నా యజమాని; యజమాని క్షేమం కోరటం నా ధర్మం. అదీకాక, నేనూ, నా కుటుంబమూ సుఖంగా బతకా

లంటే అబద్ధపు సాక్ష్యం చెప్పి తీరాలి. తనకు మాలిన ధర్మం ఉంటుందా?'' అన్నాడు ప్రసూనుడు.

సేవకుడు వెళ్ళి, ప్రసూనుడు ఇలా అన్నాడని చెప్పిన మీదట దీపకుడు సంతోషించాడు.

మరుసటి రోజు రాత్రి దీపకుడు, మరొకసారి ప్రసూనుణ్ణి హెచ్చరించుదామనే ఉద్దేశంతో అతని ఇంటికి వెళ్లాడు. లోపల మైనాకుడి భార్య ప్రసూనుడితో, ''నా భర్తను మీరే రక్షించాలి. అయన ఏ పాపమూ ఎరగడు. ఆయనకు ఏదన్నా అయితే, నేనూ, నా బిడ్డలూ దిక్కులేని వాళ్ళమవుతాం,'' అని చెప్పుకుంటున్నది.

ప్రసూనుడు ఏమంటాడోనని దీపకుడు బయటనే నిలబడి విన్నాడు.

''నన్ను క్షమించమ్మా! నేను దీపకుడి బంటును. ఆయన క్షేమమే నా క్షేమం,'' అన్నాడు ప్రసూనుడు.

ఆమె ప్రసూనుణ్ణి తిట్టి, తన దారిన తాను వెళ్ళింది. తరవాత దీపకుడు లోపలికి వెళ్ళి, పరమానందంతో ప్రసూనుణ్ణి మెచ్చుకున్నాడు. అతనికి ప్రసూనుడి మీద పూర్తి నమ్మకం చిక్కింది.

ఇది జరిగిన మర్నాడే రాజుగారు మైనాకుడి మీద విచారణ జరిపాడు. మైనాకుడు రాజుగారితో, తాను నిర్దోషి



ననీ, హత్య జరిగినప్పుడు ప్రసూనుడు అక్కడే ఉండి, జరిగినది కళ్ళారా చూశాడనీ చెప్పుకున్నాడు.

ప్రసూనుణ్ణి సాక్ష్యం చెప్పమన్నారు.

''మహారాజా, హత్య చేసినది దీపకుడే! మైనాకుడికి ఆ హత్యతో ఎలాటి సంబంధమూ లేదు,'' అన్నాడు ప్రసూనుడు.

వెంటనే దీపకుడు తన నేరాన్ని ఒప్పేసుకున్నాడు. అతనికి మరణదండన విధించి, రాజు మైనాకుణ్ణి విడుదల చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ప్రసూనుడు మొదట అబద్ధపు సాక్ష్యం

చెప్పటానికి ఎందుకు సిద్ధపడ్డాడు? యజమాని పట్ల స్వామిభక్తి చేతనా? దీపకుడు తనకు ఇస్తానన్న సహాయం మీద ఆశచేతనా? అలాటివాడు ఏ కారణమూ లేకుండా రాజు ఎదట, తన మనసు మార్చుకుని, నిజం ఎందుకు చెప్పాడు? అతను నిజం చెప్పగానే దీపకుడు నేరం ఎందుకు ఒప్పేసుకున్నాడు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ప్రసూనుడు మనసు మార్చుకోలేదు. అతను స్వతహాగా నిజాయితీపరుడన్నది స్పష్టం. కాకపోతే దీపకుడు అతన్ని పరీక్షించటానికి తన సేవకుణ్ణి పంపాడు; అలాగే తాను మరొక సారి అతనికి గట్టిగా చెప్పాలని బయలుదేరాడు. పోతే, ప్రసూనుడు తాను నిజం చెప్పబోతున్న సంగతి దాచిపెట్టటానికి అనేక కారణాలున్నాయి. తాను నిజం చెబుతాడనుకుంటే దీపకుడు నేరం నుంచి బయటపడటానికి ఎన్ని మార్గాలైనా చూడగలడు. అందుచేత దీపకుడికి తనమీద నమ్మకం కుదిరేటట్టు చెయ్యటం చాలా అవసరం. అదీగాక, తాను నిజాయితీపరుణ్ణని లోకానికి చాటాలన్న అల్పత్వం అతనిలో లేదు. మైనాకుడి భార్యకు ఎలాగూ సహాయం చెయ్యబోతున్నప్పుడు ఆ మాట ముందుగా చెప్పటం చేత ఆమెకు అధికంగా కలిగే మేలు లేదు. ఇక, దీపకుడు తన నేరాన్ని వెంటనే ఒప్పుకోవటానికి కారణం, నిజం తెలిసిన ఇతర సేవకులున్నారు. తాను పూర్తిగా నమ్మిన ప్రసూనుడే తనకు అనుకూలంగా సాక్ష్యం చెప్పనప్పుడు క్షుద్రులయిన నౌకర్లు తనను కాపాడతారని అతనికి నమ్మకం లేకపోయింది. అందుచేత అతను నిజం ఒప్పేసుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# కవిచాతుర్యం

శీతల్‌పూర్ జమీందారు నగేంద్రుడు కళా పోషకుడు. అయన చిత్రలేఖనం, గానం, నృత్యం, కవిత్వం లాటి కళలలో ప్రావీణ్యం గలవారిని ఆదరించేవాడు. అయన పోయాక అయన కొడుకు వీరేంద్రుడు జమీందారు అయాడు. తండ్రి లాగా అతనికి కళలంటే ఆదరం లేదు. అతను వ్యాయామ క్రీడాకారులను ఆదరించేవాడు.

నగేంద్రుడి హయాంలో శీతల్‌పూర్ వచ్చి చేరిన కళాకారుల పట్ల వీరేంద్రుడు చిన్న చూపుతో వారికి ఇచ్చే మామూళ్ళు తగ్గించాడు. అతనికి ఆస్థానకవి కుశారి పైన ప్రత్యేకంగా ద్వేషం ఉండేది. కుశారి నిజంగా ప్రతిభగల కవి. అందుచేత నగేంద్రుడు ఆయనను తన ఆస్థానానికి పిలిపించి, జాగీరూ, వార్షికాలూ ఇచ్చి గౌరవించి, తన ఆస్థానకవిగా పెట్టుకున్నాడు. కుశారి నగేంద్రుడి చరిత్రా, అతని పూర్వీకుల చరిత్రా అయిదు సంపుటాలలో రచించాడు. ఈ సంపుటాలు రాజభవన గ్రంధాగారంలో ఉండేవి. దసరా అనంతరం రెండు నెలలపాటు ఆ సంపుటాల పారాయణ జరిగేది. జమీందారీలో గల వయోజనులందరూ వచ్చి పారాయణ వినేవారు.

వీరేంద్రుడు తాను జమీందారు అయాక కుశారిని సభకు పిలిపించి, ''కవిగారూ, మీరు మీ ఆస్థానకవి హెూదా నిలబెట్టుకునేటందుకు ఒకే ఒక అవకాశం ఇస్తున్నాను. నాకు కవితా దానాలు పట్టవు. అయినా, మా తండ్రిగారు మీ కవితా శక్తి మెచ్చి, మిమ్మల్ని తెచ్చి పెట్టారు గనక, మీకు ద్రోహం చెయ్యదలచలేదు. అయితే నన్ను గురించి మీరు మరొక సంపుటం రచించని పక్షంలో మీకు జమీందారీ

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



నుంచి ఉద్వాసన చెప్పవలసి ఉంటుంది," అన్నాడు.

కుశారికి ఎంతో అవమానమయింది. కాని ఏమీ అనలేక, అరవ సంపుటం రచించటానికి ఒప్పుకుని, "నేను అయిదవ సంపుటాన్ని ఇంటికి పట్టుకుపోయి, అదే శైలిలోనూ, దానికి అతికే లాగూ అరవ సంపుటం రచిస్తాను," అన్నాడు.

అందుకు అనుమతి లభించింది. కుశారి అయిదవ సంపుటాన్ని ఇంటికి పట్టుకుపోయి, పని ప్రారంభించాడు. నెల రోజుల లోపల సగం గ్రంథం పూర్తి అయింది. వీరేంద్రుడి దర్బారులో అతని అభిమానుల సమక్షంలో ఆయన దాన్ని చదివి వినిపించాడు. అందరూ దాన్ని మెచ్చుకున్నారు. కుశారి తృప్తిపడి ఇంటికి వచ్చి అహోరాత్రాలు ఏక దీక్షగా అరవ సంపుటాన్ని పూర్తిచేశాడు.

కాని కుశారి అదృష్టం బాగులేక, ఆ రాత్రే అతని ఇల్లు తగలబడి పోయింది. అతని కొత్త రచనతోపాటు పాతరచన తాలూకు అయిదో సంపుటం కూడా కాలి, బూడిద అయిపోయింది. జమీందారు వీరేంద్రుడు దీన్ని క్షమించడని కుశారి గ్రహించాడు.

ఆయన అనుకున్నట్టే వీరేంద్రుడు మనుషులు వచ్చి కుశారిని పిలుచుకు పోయారు.

"అయిదవ సంపుటం ఇప్పుడెలా వస్తుంది?" అని వీరేంద్రుడు ఆయనను అడిగాడు.

"అది నేను రచించినదే కదా, మళ్ళీ రాస్తాను. ఇంకా బాగా కూడా రాస్తాను," అన్నాడు కుశారి.

"అసాధ్యం. అది పూర్వంలాగా ఎన్నడూ ఉండదు. అయిదవ సంపుటం పూర్వస్థితిలో మరి ఏర్పడదు. ఇల్లు తగలబడటానికి మీ అశ్రద్ధే కారణం. అందుకు మీరు శిక్ష పొందాలి. ఆ శిక్ష ఎలా ఉండాలో నేను మూడు రోజులలోగా

నిర్ణయిస్తాను. మీరు వెళ్ళవచ్చు." అన్నాడు వీరేంద్రుడు.

కుశారి హతాశుడై, పుట్టెడు వేదనతో ఇంటికి తిరిగి వచ్చేసరికి ఐంద్రజాలికుడు శంకరుడు ఆయన కోసం వేచి ఉన్నాడు. శంకరుడు చాలా కాలంగా దేశాంతరాలలో ఉండి తిరిగి వచ్చాడు.

"అలా ఉన్నావేం? ఏం జరిగింది మిత్రమా?" అని శంకరుడు కుశారిని అడిగాడు.

కుశారి జరిగినదంతా చెప్పాడు.

"అదా సంగతి? నేను చక్రం అడ్డు వేస్తాను. శ్రద్ధగా ఆలకించు. నేను చెప్పినట్టు చేస్తే నీకు ఏ అపదా రాదు." అన్నాడు శంకరుడు.

కుశారి శంకరుడు చెప్పినదంతా విని, దర్బారుకు వెళ్ళి, వీరేంద్రుడితో, "అయ్యా, కాగితం తగలబడినప్పుడు ఆ కాగితం బూడిద అవుతుందే గాని, దానిమీది రచన నశించదు. బుద్ధిని సరిగా కేంద్రీకరించినట్టయితే రచనను పసిగట్టవచ్చు. నాకు ఆ శక్తి ఉన్నది. అందుచేత నేను అయిదవ సంపుటాన్నీ, ఆరవ సంపుటాన్నీ పునస్సృష్టి చేయగలను. వాటి తాలూకు బూడిదను భద్రపరిచి ఉంచాను," అన్నాడు.

"అందుకు రుజువు ఏమిటి?" అని వీరేంద్రుడు అడిగాడు.

"కావాలంటే, నా శక్తి ఈ క్షణమే రుజువు చేస్తాను," అన్నాడు కుశారి.



"అలాగే చెయ్యండి, కవిగారూ. మీరు మీ శక్తి రుజువు చేస్తే మీకు శిక్ష ఉండదు సరేకదా, మీకు అదనపు సౌకర్యాలు కలిగించి, ఇతర కళలను కూడా పోషిస్తాను," అన్నాడు వీరేంద్రుడు.

"సరే, ఈ కాగితాల బొత్తి చూడండి. పై కాగితం మీద మీ యిష్టం వచ్చినది ఏదైనా రాసి, దాన్ని నాకు గాని, మరెవరికి గాని చూపకుండా ఆ కాగితం బొత్తి నుంచి ఊడదీసి, చించి, తగలబెట్టి, నుసి అంతా నలిపి, నాకు ఇచ్చెయ్యండి. నేను ఆ నుసి తీసుకుని ఆ గదిలోకి వెళ్ళి, మీరు ఏం రాశారో తెలుసుకుంటాను," అన్నాడు కుశారి.

ఆయన శంకరుడి సలహా ప్రకారం ప్రయోగం చేసి, వీరేంద్రుడు కాగితం మీద ఏం రాశాడో దాన్నే తానూ మరో కాగితం మీద రాసి చూపాడు. ఇది సాధ్యం అయినప్పుడు అయిదు, ఆరు సంపుటాలను యథాతథంగా తిరిగి రాయటం సాధ్యమేనని అందరూ ఒప్పుకున్నారు. కుశారి మూడు నెలల లోపల అయిదు, ఆరు సంపుటాలను తిరిగి రాశాడు.

శంకరుడి ఇంద్రజాలం ధర్మమా అంటూ శీతల్‌పూర్‌లో తిరిగి లలితకళలకు ఆదరం లభించింది.

ఇంతకూ ఆ ఇంద్రజాలం ఏమిటి? శంకరుడు కుశారికి ఒక ప్రత్యేకమైన కాగితాల బొత్తి ఇచ్చాడు. ఆ కాగితాలు రెండు పక్కల అంటుకుని ఉన్నాయి. అందులో మూడు, నాలుగు కాగితాల మధ్య ఒక కార్బను కాగితం, తెల్ల కాగితాల కన్న కొంచెం చిన్న సైజుది, ఉన్నది. వీరేంద్రుడు పై కాగితం మీద పెనసలుతో అదిమి రాసినప్పుడు, నాలుగో పేజీ మీద స్పష్టంగా ఆ రచన కాపీ దిగింది. కుశారి అవతలి గదిలోకి వెళ్ళి, రెండో కాగితమూ, మూడో కాగితమూ ఎత్తి చూస్తే వీరేంద్రుడు రాసినది కనిపించి, ఆయన దాన్నే మరో కాగితం మీద రాసి అందరికీ చూపాడు.





# లంచం కథ

మహీపాలుడు ఏలే న్యాయపుర దేశంలో ధర్మం నాలుగు పాదాలా నడుస్తుందని చెప్పుకునే వారు. మహీపాలుడు ధర్మానికి హాని కలగకుండా ఉండడం కోసం ఎన్నో శాసనాలు చేసి, సక్రమంగా వాటిని అమలు జరిపే వాడు. అంతేగాక, న్యాయ నిర్ణయం చెయ్యడంలో ఆయన ఎలాటి పక్షపాతమూ చూపే వాడు కాడు.

ఇలాంటి సందర్భంలో ఆ దేశంలో ఒక విచిత్ర సంఘటన జరిగింది. చంద్రముఖుడు అనే న్యాయాధికారి లంపటుడి వద్ద డబ్బు తీసుకుని, ఒక విచారణలో అతనికి అనుకూలంగా తీర్పు చెప్పాడు. దాన్ని గురించి రమణుడు అనేవాడు రాజుగారి దగ్గిర ఫిర్యాదు తెచ్చాడు.

ఈ ఫిర్యాదు గురించి విన్న రాజుగారికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. దొంగతనాలూ, హత్యలూ, వ్యాపారంలో మోసమూ లాటి అనేక నేరాలు దేశంలో జరిగాయి, కాని డబ్బు తీసుకుని తప్పుడు న్యాయం చెప్పడం, యీనాటివరకూ జరగలేదు.

అసలు జరిగినది ఏమంటే, లంపటుడు అనే ఒక పెద్ద వ్యాపారి తన గిడ్డంగుల కోసం న్యాయపురంలో ఒక విశాలమైన ఖాళీ ప్రదేశాన్ని కొని, అక్కడ భవనాల నిర్మాణం ప్రారంభించాడు. అయితే ఆ ప్రదేశం మధ్యలో కొద్ది మేర రమణుడు అనే వాడిది. రమణుడు పేదవాడు; అయినా వాడు తన అవరణను అమ్మ నిరాకరించాడు. అది అనాదిగా రమణుడి పూర్వీకుల స్థలం. తమ వంశంలోని పితృదేవత లందరూ అక్కడే ఉంటున్నారని వాడి పిచ్చినమ్మకం.

రమణుడు సకుటుంబంగా తీర్థయాత్రకు పోయి ఉన్న సమయంలో

"వసుంధర"



లంపటుడు రమణుడి స్థలం ఆక్రమించి, గిడ్డంగుల నిర్మాణం మొదలుపెట్టాడు. రమణుడు తిరిగివచ్చి పేచీ పెట్టాడు. లంపటుడు రమణుడికి డబ్బు కోరినంత ఇస్తానన్నాడు.

"నీ డబ్బు కోసం నా పితృదేవతలకు నిలవ నీడ లేకుండా చేస్తానా?" అన్నాడు రమణుడు.

"నీకు డబ్బు అక్కర్లేకపోతే అది నీ కర్మ! నేను మాత్రం కట్టడం పని ఆపించను. ఏం చేస్తావో చేసుకో!" అన్నాడు లంపటుడు.

రమణుడు న్యాయాధికారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి విచారణ జరుపుతాననీ, ముందుగా కట్టడం పని ఆపమనీ లంపటుడితో అన్నాడు.

లంపటుడికి గుండె జారిపోయింది. ఒక పేదవాడు తనకు ఇలా రాహు వల్లే అడ్డుపడగలడని అతను ఊహించి ఉండలేదు. తీర్పు తనకు విరుద్ధంగా జరిగితే చాలా నష్టం వస్తుంది. అతను చంద్రముఖుణ్ణి ఏకాంతంగా కలుసుకుని, తన పరిస్థితి చెప్పుకున్నాడు.

"రమణుడి పత్రాలు సక్రమంగా ఉన్నాయి. అతను తన భూమిని అమ్మ దలచలేదు. అలాటప్పుడు నేను చెయ్య గలది ఏమున్నది?" అన్నాడు న్యాయాధికారి చంద్రముఖుడు.

తరవాత ఏమి జరిగినదీ ఎవరికీ తెలియదు. కాని తీరా విచారణ జరిగినప్పుడు రమణుడి పత్రాలలో ఎలా ఉన్నదంటే, రమణుడి పూర్వీకులు లంపటుడి పూర్వీకుల నుంచి ఆ భూమిని ఉచితంగా పుచ్చుకున్నారనీ, లంపటుడి వంశంవారు ఏ పరిస్థితులలోనైనా ఆ భూమిని తగిన పరిహారం ఇచ్చి తిరిగి పుచ్చుకోవచ్చుననీ ఉన్నది. తన పత్రాలలో అలా ఉన్నదని విని రమణుడు ఆశ్చర్యపోయి, ఇతరుల చేత చదివించుకుంటే, నిజంగా అలాగే రాసి ఉన్నది.

రమణుడు లంపటుడితో, "ఆ భూమి మీదైనప్పుడు, మా పితృదేవతలు అక్కడ ఎందుకుంటారు?" అని, అతను ఇచ్చిన డబ్బుతీసుకుని, తృప్తిపడి ఇంటికి వెళ్లిపోయాడు.

అయితే, తనకు అన్యాయం జరిగిందని రమణుడికి మర్నాడే తెలిసింది. న్యాయాధికారి దగ్గిర ఉండే నౌకరు ఒకడు, తన యజమాని లంపటుడి నుంచి బోలెడంత డబ్బు పుచ్చుకోవటం కళ్ళారా చూసి, ఆ సంగతి రమణుడికి చెప్పాడు. తన పితృదేవతలకు ద్రోహం జరిగిందనుకుని, అతను ఈసారి తిన్నగా రాజుకే ఫిర్యాదు చేశాడు.

రాజు రహస్యంగా దర్యాప్తు జరిపించి, న్యాయాధికారి ఇంట పదివేల వరహాల రొక్కం ఉన్నదని తెలుసుకున్నాడు. రాజు న్యాయాధికారిని పిలిపించి, నిలవ దీసి అడిగితే, తాను డబ్బు తీసుకుని అన్యాయంగా తీర్పు చెప్పినట్టు న్యాయాధికారి ఒప్పేసుకున్నాడు.

మహీపాలుడు మండిపడి, యీ అవినీతి చర్యకు చంద్రముఖుణ్ణి సంజాయిషీ అడిగాడు. చంద్రముఖుడు ఇలా చెప్పాడు:

"మహారాజా, నా కూతురికి మంచి సంబంధం వచ్చింది. అయితే నేను



వరకట్నం కింద పదివేల వరహాలు ఇచ్చుకోవలసి ఉన్నది. నా ఆదాయంతో అంత డబ్బు నా జన్మలో నిలవ చెయ్యలేను. చూస్తూ, చూస్తూ అంత మంచి సంబంధం వదులుకోవలసి వస్తున్నదని బాధపడుతున్న సమయంలో లంపటుడి వ్యవహారం వచ్చింది. తీర్పు తనకు అనుకూలంగా ఉండే మాటైతే పదివేల వరహాలు ఇస్తానన్నాడు. రమణుడిది మూర్ఖపు పట్టు. అందరికీ లాభం కలిగేలాగా నేను తీర్పు చెప్పాను. రమణుడికి డబ్బు రావడమేగాక, నా కూతురి పెళ్ళి సమస్యా, లంపటుడి వ్యాపార సమస్యా తీరిపోయాయి."

మహీపాలుడు లంపటుణ్ణి పిలిపించి, " మానవులలో కొన్ని బలహీనతలు ఉంటాయి. చంద్రముఖుడు ఎంతో మంచివాడు. అటువంటివాడిలోని బలహీనతలు రెచ్చగొట్టి, అతని చేత అక్రమమైన పని చేయించావు. ఇది ఏమాత్రం సహించరానిది. దీనికి నీ సంజాయిషీ ఏమిటి ? " అని అడిగాడు.

" నేను ఎవరి బలహీనతనూ రెచ్చగొట్ట లేదు. చంద్రముఖుడు నన్ను డబ్బు అడిగాడు; డబ్బు ఇస్తే సమస్య పరిష్కారమవుతుందని అన్నాడు. ఇవ్వక పోవడం వల్ల నాకు ఎక్కువ నష్టం కలుగుతుంది గనక, ఒప్పేసుకున్నాను," అన్నాడు లంపటుడు.

మహీపాలుడికి ఎటూ పాలుపోలేదు. ఒక కొత్తరకం నేరం తన దేశంలో జరిగింది. దీనికి శిక్ష విధించే ముందు ఈ నేరానికి మొదటి కారకుడు ఎవరో నిర్ణయించటం అవసరమని అయనకు తోచింది.

అయితే అది సులువుగా తేలే సమస్య కాదు. చెట్టు ముందా విత్తు ముందా అన్న సమస్యలాటిదే ఇదీనూ. కొందరు తెలివిగలవాళ్ళు మొదటి నేరం ఎవరిదో తెలుసుకుని కూడా, చంద్రముఖుడి వద్దా, లంపటుడి వద్దా డబ్బు పుచ్చుకుని, ఏమీ తెలియనట్టు మౌనంగా ఉండిపోయారు. అందుచేత రాజు చంద్రముఖుడి నేరాన్ని విచారణకు పెట్టే అవకాశం లేకపోయింది.

అది మొదలు ఇలాంటి నేర్గాలు పెరిగిపోయాయి. దీనికి " లంచం " అని పేరు వచ్చింది. ఈ నేరంలో మొదటి తప్పు లంచం ఇచ్చినవాడిదా, పుచ్చుకున్నవాడిదా? దీనికి సమాధానం సూటిగా ఎవరూ చెప్పలేరు. పరిస్థితులనుబట్టి సమాధానాలు మారుతూంటాయి. అయితే దీనికి శిక్ష లేకుండా ఉన్నది. కారణం ఏమిటంటే, మిగిలిన నేరాలకు లేని శక్తి ఒకటి దీనికి ఉన్నది: ఇది న్యాయాన్ని కూడా మార్చగలదు !



# 172. సరికొత్త అగ్నిపర్వతాలు

కళ్ళ ఎదట నరికొత్త అగ్నిపర్వతాలు పుట్టటం చాలా అరుదు. ఈ శతాబ్దిలో అలాటి అగ్నిపర్వతం 1944 లో మెక్సికోలో పుట్టింది. [1975 మార్చి నంచిక చూడండి.] కిందటి ఏడు రష్యాలోని కామ్చాత్కా ద్వీపకల్పంలో అనేక అగ్నిపర్వతాలు ఒకేసారి పుట్టాయి. ఈ సారి విశేషం ఏమంటే శాస్త్రవేత్తలు, అవి ఎక్కడ, ఎప్పుడు పుట్టుతాయో రెండు వారాలు ముందుగా తెలుసుకుని, వాటి పుట్టుక గమనించటానికి కామెరాలలో నహా సిద్ధంగా ఉన్నారు.





# బతకడానికి దారి

జగపతి తన పెళ్ళాం, పిల్లల బాధ్యత ఏమీ పట్టించుకునే వాడుకాడు. అతని పూర్వీకులు ఒకప్పుడు బాగా బతికారు. ఆ వాసన జగపతిని పూర్తిగా వదలలేదు. అతను తెలిసిన వాళ్లందరి దగ్గిరా అప్పులు చేసి, కొంత కాలం నెట్టు కొచ్చాడు. ఆ అప్పులు మితిమీరిపోయి, అవి తీరే దారి కనబడక, అప్పులవాళ్ళ కంట పడ కుండా ఉండటానికి జగపతి చీకటితోటే ఇల్లు వదిలి, అడవిలో రోజంతా తిరిగి, చాలా చీకటిపడి ఇంటికి రాసాగాడు.

ఈ లోపల అప్పులవాళ్ళు వచ్చి, జగపతి భార్యను నానా మాటలూ అని వెళుతూండే వారు. చూసి, చూసి, ఆమె విసిగిపోయి, "నీ కేం మగమహారాజువు! అడ్డమైన తిరుగుళ్ళూ తిరిగి అర్ధరాత్రి ఇల్లు చేరుతావు. అప్పుల వాళ్ళకు సమాధానం చెప్పలేక నేను చచ్చిపోతున్నాను. అందరూ రేపు తెల్లవారగానే వస్తారట. ఇంటిపట్టున ఉండు," అన్నది.

ఆ రాత్రి జగపతికి నిద్ర పట్టలేదు. రేపు అప్పుల వాళ్ళకు ఏం చెప్పుకోవాలి? వాళ్ళ బాకీలు ఎలా తీర్చాలి? వాళ్ళంతా కలిసి తనను చితకతన్నితే తన పరువు ఏమవుతుంది? అంతదాకా ఎందుకు? అతనికి అప్పుల వాళ్ళ ముఖాలు చూచే ధైర్యం కూడా లేదు. తన మీద తనకే రోత పుట్టింది. అతను చీకట్లోనే ఇంటి నుంచి బయలుదేరి, ఊరి చివర మర్రి చెట్టు దగ్గిర పాడుబడిన బావి దగ్గిరికి వెళ్ళాడు. అందులో దూకి ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకున్నాడు.

అతను బావిలోకి దూక బోతూండగా ఆ బావిలో నుంచి ఒక పిశాచం బయటికి వచ్చి, జగపతిని ఎగాదిగా చూసి, "నీకు మతి ఉన్నదా, లేదా? భూతప్రేతాలు

ఎం. కామేశ్వరరావు

తిరిగేవేళ ఈ వైపు వచ్చావు దేనికి?'' అని అడిగింది.

జగపతి పిశాచానికి తన కథ అంతా చెప్పి, ''బతకటం ఎలాగూ సాధ్యం కాకనే చావటానికి వచ్చాను. పక్కకు తప్పుకో!'' అన్నాడు.

పిశాచం కంగారుగా అతన్ని ఆపి, ''అంతపని చెయ్యకు! నేను కూడా క్షణికావేశంలో నీ లాగే ఇందులో దూకి, ఇలా మారాను. తరవాత నా భార్యా, పిల్లలూ పడ్డ కష్టాలు ఇంతా అంతా కాదు. నా మాటవిని తిరిగివెళ్ళిపో!" అన్నది.

''ఇప్పుడు నేను చావకపోయినా, తెల్ల వారి అప్పులవాళ్ళు నా ప్రాణాలు తీసేస్తారు,'' అన్నాడు జగపతి.

పిశాచం చప్పున బావిలోకి దూకి, వెంటనే పెద్ద బంగారు నాణెంతో తిరిగి వచ్చి, ''దీంతో నీ అప్పులు తీర్చుకో. మళ్ళీ ఈ చాయలకు రాకు!'' అన్నది.

జగపతి ఆ నాణెం తీసుకుని, ఆనందంతో ఇంటికి వెళ్ళి, జరిగినదంతా తన భార్యకు చెప్పాడు.

ఆమె అంతా విని, ''నీ తెలివి తెల్లవారా! ఇచ్చిందే చాలునని ఒక్క నాణెం తెచ్చావా? ఇంకాసిని అడిగి తీసుకు రాకూడదూ?'' అన్నది.

జగపతి, "అవును సుమా!" అన్నాడు.

ఆ నాణెంతో జగపతి అప్పులన్నీ తీరిపోగా, మూడు రోజులపాటు ఇంటిల్లిపాతికీ రాజవైభోగంగా జరిగిపోయింది.



నాలుగో రోజు జగపతితో అతని భార్య, "ఈ రాత్రికి నువు మళ్ళీ చావటానికి బావి దగ్గిరికి వెళ్ళు," అన్నది.

జగపతి అలాగే బావి వద్దకు వెళ్ళి, అందులో పడబోయినట్టు నటించాడు. పిశాచం బయటికి వచ్చి, "మళ్ళీ నీకు ఈ పాడుబుద్ధి పుట్టిందేం?" అని అడిగింది.

"ఏం చెయ్యమంటావు? అప్పులైతే తీర్చగలిగాను గాని, బతకడానికి మార్గం ఏదీ కనిపించటం లేదు," అన్నాడు జగపతి.

పిశాచం మారు మాట్లాడకుండా బావి లోకి వెళ్ళి, మరో బంగారు నాణెం తెచ్చి జగపతికి ఇచ్చింది. జగపతి దానితో ఇంటికి చేరుకుని, పది రోజులు జల్సాగా గడిపి, మళ్ళీ బావి దగ్గిరికి వచ్చి, "నా ఖర్మ! నాకు ఏమీ పని దొరకటం లేదు. పెళ్ళాన్నీ, పిల్లల్నీ పోషించలేకుండా ఉన్నాను!" అని పిశాచానికి చెప్పి, మూడో సారి బంగారు నాణెం పట్టుకుపోయాడు.

ఈసారి జగపతి భార్య దాన్ని కరిగించి చేతులకు గాజులు చేయించుకున్నది.

మర్నాడే మళ్ళీ జగపతి బావి దగ్గిర హాజరయాడు. పిశాచం కనిపించి, అప్పుడే వచ్చావేమని అడిగింది.

"నాకు విసుగెత్తి పోతున్నది. చేద్దామంటే ఏ పనీ దొరకదు!" అన్నాడు జగపతి.

"నాకూ విసుగుగానే ఉంది. నువు ఈ కుళ్ళు మనుషుల మధ్య బతకలేవు. బావిలోకి దూకెయ్యి. హాయిగా ఇద్దరమూ కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేద్దాం!" అన్నది పిశాచం.

జగపతి పై ప్రాణాలు పైకి ఎగిరాయి. అతను కంగారుగా వెనక్కుపోయి, "పని దొరుకుతుందేమో మరోసారి చూస్తాను," అంటూ ఇంటి కేసి పరిగెత్తాడు.

"నేను సహాయం చేస్తున్నంత కాలమూ నీకు పని దొరకదు. ఇప్పుడిక తప్పకుండా దొరుకుతుంది. బతకడానికి దారి కనిపించి తీరుతుంది," అనుకున్నది పిశాచం.





# సమర్థురాలు

గంగాపురంలో గోవిందశెట్టి అనే దొడ్డ వ్యాపారి ఉండేవాడు. అతని కొడుకు శ్రీమంతుడు అనేవాడు వట్టి దద్దమ్మ. వాడికి పెళ్లీడు వచ్చినా బుద్ధి వికసించ లేదు. పెళ్లి చేస్తే వాడిలో మార్పు వస్తుందని కొందరు సలహా ఇచ్చారు. డబ్బున్న వాడు కావటం చేత గోవింద శెట్టి తేలికగా శ్రీమంతుడికి సంబంధం చూసి, పెళ్లి చేశాడు.

పెళ్లికూతురు లక్ష్మి అందమైనదే గాక చురుకైనది కూడా. మనస్సు వికసించని శ్రీమంతుడు పెళ్లిలోనే తన భార్య కేసి చూడలేక సిగ్గుపడి, భయపడ్డాడు కూడా. వాడి అమాయకత్వం చూసి, వాడు వెర్రి బాగుల వాడని లక్ష్మి వైపువాళ్లు దిగులు పడ్డారు. లక్ష్మి మాత్రం తొణకలేదు. తన భర్త కేవలమూ అమాయకుడేననీ, ప్రయత్నిస్తే అతన్ని మామూలు మనిషి చేయవచ్చుననీ ఆమె తన వాళ్లకు ధైర్యం చెప్పింది.

శ్రీమంతుడు బావిలో కప్పలాగా తన ఇంటి వాతావరణం తప్ప ఇంకేమీ ఎరగడు. అతనికి ప్రపంచం మొహం తెలీదు. వాడు మారుతాడేమో నన్న ఆశతో గోవిందశెట్టి తన కొడుకునూ, కోడలినీ తీర్థ యాత్రలు చేసి రమ్మని, వాళ్లకు పుష్కలంగా డబ్బు ఇచ్చాడు. కోడలు సమర్థురాలని గ్రహించి, ఆయన వాళ్ల వెంట మరెవరినీ పంపలేదు.

తన భార్య వెంట వెళ్లటానికి కూడా శ్రీమంతుడు, ఎవరో తెలియని మనిషి వెంట పోతున్నట్టు, భయపడ్డాడు. కాని ఇల్లు దాటాక కొత్త కొత్తచోట్లు చూడటమూ, వింత వింత దృశ్యాలు చూడటమూ అతనికి సరదాగానే ఉన్నది. ఖర్చు చెయ్యటానికి డబ్బున్నది గనక

బూర్లె నాగేశ్వరరావు



ప్రయాణం సుఖంగా సాగింది. అయితే ఈ కొత్త ప్రదేశాలలో శ్రీమంతుడికి లక్ష్మి ఒక్కతే ఆప్తురాలయింది. తల్లి చాటు పిల్లవాడిలాగా అతను ఆమె కొంగు పట్టుకు తిరుగుతూ వచ్చాడు. తాను తప్పిపోతానని అతనికి చెడ్డభయం!

ఒక ఊళ్ళో అంగడిలో మంచి ద్రాక్షపళ్ళూ, అరటి పళ్ళూ కనిపించాయి. అవి చూడగానే శ్రీమంతుడికి తన నాయనమ్మ జ్ఞాపకం వచ్చింది. ఆమెకు ద్రాక్షపళ్ళూ, అరటిపళ్ళూ చాలా ఇష్టం. వెంటనే అతను లక్ష్మితో, "ఈ పళ్ళు మా నాయనమ్మకు చాలా ఇష్టం. ఇంత మంచి పళ్ళు ఆమె ఎప్పుడూ తిని ఉండదు. మా తాతయ్య ఆవిడ కోసం అమడదూరం పోయి ద్రాక్షపళ్ళు తెచ్చాడట," అన్నాడు.

"అలా అయితే, మనం తప్పక తిరుగు ప్రయాణంలో కొనుక్కుపోదాం." అన్నది లక్ష్మి.

"అంతదాకా ఆగటం దేనికి? మా ఊరి వాళ్ళెవరన్నా కనిపిస్తే వాళ్ళ చేతికిచ్చి ఇప్పుడే పంపవచ్చు." అన్నాడు శ్రీమంతుడు మొండిగా.

లక్ష్మి పరధ్యానంగా సరేనన్నది. శ్రీమంతుడు తీర్థప్రజల్లో తమ ఊరివాళ్ళు కనిపిస్తారేమోనని వెయ్యి కళ్ళతో చూడసాగాడు. అతన్ని ఒకచోట కూర్చోబెట్టి, లక్ష్మి పక్కనే ఉన్న కోనేట్లో స్నానం చెయ్యటానికి వెళ్ళింది.

శ్రీమంతుడు దారినే పోతున్న ఇద్దరు మనుషులను పలకరించి, "మీది గంగాపురం కాదూ?" అని అడిగాడు.

వాళ్ళు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. అందులో ఒకడు, "అవును, ఏం?" అన్నాడు.

"నేను గోవిందశెట్టి కొడుకును. మా నాయనమ్మకు కొన్ని పళ్ళు పంపాలి. మీరేమీ అనుకోకుండా ఉంటే మీ ద్వారా పంపిస్తాను. ఏమంటారు?" అన్నాడు శ్రీమంతుడు.

"దాని కేం భాగ్యం? ఆ పళ్ళేవో త్వరగా తీసుకురా, మేం వెళ్ళాలి," అన్నారు వాళ్ళు.

శ్రీమంతుడు పెద్ద పళ్ళదుకాణంలోకి వెళ్ళి, పాతిక రూపాయలకు ఒక పెద్ద బుట్టనిండా ద్రాక్షపళ్ళూ, అరటిపళ్ళూ కొని తెచ్చి, వాళ్ళకిచ్చి, "వీటిని జాగ్రత్తగా మా ఇంటికి చేర్చండి. మీ మేలు మరవను," అన్నాడు.

వాళ్ళు పళ్ళు తీసుకుని వెళ్ళిపోగానే శ్రీమంతుడు లక్ష్మి దగ్గిరికి తిరిగి వచ్చి, తాను చేసిన పని చెప్పాడు. లక్ష్మి నీరు గారిపోయి, "ఇంకెప్పుడూ అలా తెలియని ముఖాలను నమ్మకు. జ్ఞాపకం ఉంచుకో." అన్నది.

తరవాత ఆ మనుషులు శ్రీమంతుణ్ణి వదల దలచలేదు. శ్రీమంతుడూ, లక్ష్మి మరో యాత్రాస్థలానికి వెళ్ళేటప్పుడు వాళ్లు కూడా వెనకగా అక్కడికి వచ్చారు. కొత్త చోట లక్ష్మి శ్రీమంతుడూ ఒక సత్రంలో మంచి గది తీసుకుని అందులో బస చేశారు. శ్రీమంతుడు సత్రం నుంచి ఒంటరిగా బయటికి రాగానే ఆ ఇద్దరూ అతనికి ఎదురుపడి, నవ్వుతూ పలకరించారు.

వాళ్ళను చూసి శ్రీమంతుడు పరమానందం చెంది, "గంగాపురం నుంచి ఎప్పుడొచ్చారు? మా నాయనమ్మ ఏమన్నది? మా ఇంట్లో అందరూ బాగున్నారా?" అని అడిగాడు.





'' నువు పంపిన పళ్ళు చూసి మీ నాయనమ్మ సంతోషంతో మూర్ఛపోయింది. మీ నాన్న నీ తెలివికి సంతోషించాడు. పోతే మీ నాయనమ్మ నీకు ఒక మాట చెప్పమన్నది. యాత్రల నుంచి ఆమెకు ఓ వెండి పళ్ళెమూ, బంగారు లోటా కావాలట. వెంటనే పంపించ మన్నది. మరి మేం వస్తాం,'' అన్నారు వాళ్ళు.

"ఆగండి, ఆగండి. మీరు గంగాపురం ఎప్పుడు వెళుతున్నారు?" అన్నాడు శ్రీమంతుడు.

'' ఇప్పుడే వెళుతున్నాం. ఇంకెవరి ద్వారా అయినా పంపించరాదా?'' అన్నారు వాళ్ళు.

"అలా కాదు. ఇక్కడ నాకు మీరు కాక ఎవరున్నారు?'' అన్నాడు శ్రీమంతుడు.

'' అయితే త్వరగా ఆ వెండిపళ్ళెమూ, బంగారులోటా ఇచ్చెయ్యి మరి!'' అని వాళ్ళు అతన్ని తొందర చేశారు.

శ్రీమంతుడు ఒక్క అంగలో సత్రం లోకి వెళ్ళి, డబ్బుతో బయటికి వచ్చాడు. ముగ్గురూ కలిసి బంగారం కొట్టుకు వెళ్ళి, ఒక వెండి పళ్ళెమూ, బంగారు లోటా నూట యాభై రూపాయలకు కొన్నారు. వాటిని శ్రీమంతుడు ఆ మనుషుల కిస్తూ తన కృతజ్ఞత తెలుపుకున్నాడు.

వాళ్ళను పంపేసి శ్రీమంతుడు సత్రం గదికి తిరిగి వచ్చి,'' నువ్వు వట్టి అనుమానం మనిషివి. వాళ్ళు గంగాపురం నుంచి తిరిగివచ్చారు,'' అంటూ వాళ్ళతో జరిగినదంతా భార్యకు చెప్పాడు.

లక్ష్మి సంచీ తీసి చూస్తే అందులో డబ్బు లేదు. ఆమె నోట మాట రాలేదు. వాళ్ళు దొంగ వెధవలని నిరూపిస్తే తప్ప శ్రీమంతుడి కళ్ళు తెరుపుడు పడవు. అందుచేత ఆమె అతనితో,'' అవును, వాళ్ళు పెద్దమనుషులే! ఈ సారి వాళ్ళు కనిపిస్తే చెప్పు, వాళ్ళను మర్యాదచేయక పోవటం ఏం బాగుంటుంది?'' అన్నది.

లక్ష్మి తన ఒంటి మీది నగలు కొన్ని అమ్మి మరొక యాత్రాస్థలానికి ప్రయాణం కట్టింది. దొంగలకు ఈ దంపతులు కిక్కురుమనక పోవటం చూసి మరింత ఆశ పుట్టింది. కొత్త స్థలంలో వాళ్ళిద్దరూ శ్రీమంతుడి కంటపడ్డారు. అతను వాళ్ళను అప్యాయంగా పలకరించి, ఎంతో మర్యాదగా తాము సత్రంలో బసచేసిన గదికి తీసుకు వచ్చి, తన భార్యకు పరిచయం చేశాడు.

లక్ష్మి వాళ్ళను చూస్తూనే అమాయకంగా, "రండి, రండి! గంగాపురంలో మా అత్తా, మామలు బాగున్నారా? మీరు మాకెంతో సహాయం చేస్తున్నారు," అన్నది.

వాళ్ళు ఆమెను చూసి ఆ మొగుడికి తగ్గ పెళ్ళామే అనుకుని సంతోషించారు. ఆమె వారికి ఫలహారం పెట్టి, "మీరు ఏమీ అనుకోకుండా మాకు మరొక్క సహాయం చెయ్యాలి," అన్నది.

"మేం మీ కోసం ప్రత్యేకంగా ఏమీ చెయ్యటం లేదు. మళ్ళా త్వరలోనే గంగాపురం పోతాం. ఏమన్నా కబురు ఉంటే చెప్పండి," అన్నారు వాళ్ళు.

"అయితే వెళ్ళే ముందు ఒక్కసారి కనిపించండి," అని లక్ష్మి వాళ్ళను సాగనంపింది.

తరవాత ఆమె పక్క గదుల్లో వాళ్ళకు దొంగల సంగతంతా చెప్పి, వాళ్ళను పట్టుకోవటానికి ఒక నాటకం



ఆడతాననీ, అందుకుగాను తన మామ గారి వయసు గల ఒక పెద్దమనిషీ, ఆయన తల్లిలా కనిపించే ఒక ముసలా విడా సహాయపడాలనీ కోరింది. వాళ్ళు సరేనన్నారు. ఆమె వాళ్ళిద్దరినీ తీసుకు వచ్చి, ఒక మంచం మీద కూర్చోబెట్టింది. వాళ్ళు అప్పుడే వచ్చినట్టుగా ఒక సంచీ, చేతి కర్రా, చెప్పుల జతా అక్కడే ఉంచింది. ఆమె శ్రీమంతుణ్ణి నోరు మెదప వద్దనీ, ఏం జరిగేదీ చూస్తూండ మనీ గట్టిగా హెచ్చరించింది.

కొంచెంసేపటికి దొంగ "పెద్దమను షులు" గదిలోకి వచ్చారు; వస్తూనే కొత్తవాళ్ళను చూసి గతుక్కుమన్నారు.

"రండి, రండి! ఆగిపోయారేం? మీకు తెలుసుగా; వీరు మా మామగారు గోవిందశెట్టిగారు. ఆమె వారి తల్లి!" అన్నది లక్ష్మి.

దొంగ వెధవలు తత్తరపడుతూ, పారి పోయే ఉద్దేశంతో వాకిలి కేసి చూశారు. కాని వాకిలికి అడ్డంగా యమదూతల్లాగా నలుగురు మనుషులు, వాళ్ళ కేసి కొర కొరా చూస్తూ నిలబడి ఉన్నారు.

లక్ష్మి నడుం బిగించి, "మా వారు ఇచ్చిన వెండి పళ్ళెమూ, బంగారు లోటా ఏం చేశారు? చెప్పకపోతే మీ వీపులు బద్దలవుతాయి," అన్నది.

"క్షమించండి! బుద్ధి గడ్డి తిన్నది. మాకు గంగాపురం తెలీదు. వీరిద్దరినీ మేం ఎరగం!" అంటూ వాళ్ళు లక్ష్మి కాళ్ళ మీద పడ్డారు.

శ్రీమంతుడు పట్టరాని కోపంతో, "ఎంత మోసం! ఎంత మోసం!" అంటూ కర్రతో ఇద్దరి వీపుల మీదా కొట్టాడు. వాళ్ళు కాలి సత్తువకొద్దీ పారి పోయారు. లక్ష్మి తనకు సహకరించిన వారికి కృతజ్ఞతలు చెప్పుకున్నది.

అది మొదలు శ్రీమంతుడికి తన భార్య తెలివితేటలలో గురి కుదిరింది. ఆ విధంగా అతను భార్య ద్వారా లోక జ్ఞానం సంపాదించి మామూలు మనిషి అయాడు.






పూర్వం ఒక గజదొంగ తన జీవితమంతా పెద్ద పెద్ద దొంగతనాలలో గడిపి, ఎన్నడూ పట్టుబడకుండా తప్పించుకుంటూ, చాలా డబ్బు గడించాడు. వయస్సు మళ్లినాక అతను దొంగతనాలు మానేసి, ధారానగరం చేరి, విదేశీవర్తకుడనని చెప్పుకొని, అక్కడ నివాసం ఏర్పాటు చేసుకొని జీవించ సాగాడు. అతని పేరు ధారాదత్తుడు.

వృద్ధాప్యంలో ప్రవేశిస్తున్న ధారాదత్తుడి ఆరోగ్యం అంత బాగా లేదు. అయితే ఆ నగరంలో సోమశాస్త్రి అనే ఘనవైద్యుడు ఆయనకు అవసరమైన చికిత్సలు చేస్తూండే వాడు. ఆయన వైద్యం ధారాదత్తుడికి అద్భుతంగా పని చేసేది.

ఇంతలో సోమశాస్త్రి అకస్మికంగా చనిపోయాడు. ధారాదత్తుడు తనకు సరి అయిన వైద్యం చేసేవాడు ఉండడని భయపడ్డాడు. అయితే సోమశాస్త్రి శిష్యుడు సుమంతుడు అనే వాడు సోమశాస్త్రి స్థానంలో వైద్యం చేస్తూ, త్వరలోనే గురువు అంతటి వాడన్న కీర్తి తెచ్చుకున్నాడు.

ఈసారి అస్వస్థత కలిగినప్పుడు ధారాదత్తుడు సుమంతుడి నుంచి చికిత్స పొందటానికి బయలు దేరాడు. ధారాదత్తుడి వద్ద రంగడు అనే నౌకరు కుర్రవాడు తప్ప ఇంకెవరూ లేరు. రంగడు బండి కట్టి తెచ్చి, ధారాదత్తుణ్ణి సుమంతుడి వద్దకు తీసుకు పోవటానికి బయలు దేరాడు.

మధ్య దారిలో దుకాణాల వీధిలో జనం గుంపులు గుంపులుగా ఉన్నారు. ఒక యువకుణ్ణి స్తంభానికి కట్టేసి కొందరు చావగొట్టుతున్నారు. రంగడు

గంగిశెట్టి శివకుమార్



బండి దిగి వెళ్లి, సంగతి తెలుసుకొని వచ్చి, ధారాదత్తుడితో చెప్పాడు. ఆ యువకుడు దొంగతనం చేయబోయి దొరికి పోయాడట. ఈ మాట చెప్పి రంగడు బండిని ముందుకు సాగించాడు.

ధారాదత్తుడికి ఆ యువకుణ్ణి చూస్తే చాలా జాలి కలిగింది. అతను అమాయకుడై ఉండాలి. చోరవిద్యలో నైపుణ్యం గలవాడు పట్టుబడ నవసరం లేదు. ధారాదత్తుడు ఎన్నో ఏళ్లపాటు ఎంతెంతో గొప్ప దొంగతనాలు చేసి కూడా ఎన్నడూ పట్టుబడ లేదు.

బండి సుమంతుడి వైద్యశాల చేరింది. సుమంతుడు ధారాదత్తుడి రోగలక్షణాలు తెలుసుకొని మందు ఇచ్చాడు. తరవాత ఇద్దరూ కబుర్లలోకి దిగారు.

"సోమశాస్త్రిగారు పోయాక మళ్లీ అంతటి ఘన వైద్యుడు పుట్టడని అందరూ అనుకున్నారు. కాని నువు ఆయన లేని లోటు తీర్చటం చాలా గొప్ప విషయం," అన్నాడు ధారాదత్తుడు.

"అది కూడా గురువు గారి చలవే. ఆయన పోయేముందు, తాను నేర్చు కున్నదీ, అనుభవ పూర్వకంగా తాను తెలుసుకొన్నదీ, యావత్తూ వివరంగా రచించి ఒక గొప్ప వైద్య శాస్త్ర గ్రంథం తయారు చేశారు. దాని సహాయంతోనే నేను రోగులకు చికిత్సలు చేయగలుగు తున్నాను," అన్నాడు సుమంతుడు.

ధారాదత్తుడు సుమంతుడి వద్ద సెలవు పుచ్చుకొని ఇంటికి వచ్చాడు. సుమంతు డిచ్చిన ఔషధం చాలా బాగా పని చేసి నట్టు కనబడింది. అతనికి ఒక ఆలోచన వచ్చింది. ప్రశస్తమైన వైద్యశాస్త్ర గ్రంథం ఉండబట్టే గదా సుమంతుడు ఒక ఘన వైద్యుడి అడుగు జాడలలో వైద్యవృత్తి కొనసాగించ గలుగు తున్నాడు! అలాగే చోరశాస్త్రం గురించి ఒక సమర్థుడు గ్రంథం రాస్తే, తాను వీధిలో చూసిన యువకుడి లాగా అస మర్థులైన దొంగలు పట్టుబడటమూ,

క్రూరమైన శిక్షకు గురి కావటమూ జరగదు గదా! తనకున్న అపారమైన చోరానుభవమూ, నైపుణ్యమూ వివరించుతూ చోరశాస్త్ర గ్రంథం రచించ నిశ్చయించాడు ధారాదత్తుడు.

అతను తన అనుభవాలన్నిటినీ నెమరు వేసుకుని, చోరుడికి ఎదురయే సమస్యలన్నీ జ్ఞాపకం తెచ్చుకుని, తాను వాటి నన్నిటినీ ఎలా పరిష్కరించుకున్నాడో వివరిస్తూ చోరశాస్త్రం రాయటం మొదలు పెట్టాడు. కొంత కాలానికి గ్రంథం పూర్తి అయింది.

ధారాదత్తుడు పుస్తకం రాస్తున్న సంగతి రంగడికి తెలుసు. అది చోరశాస్త్ర మని కూడా వాడు పసికట్టాడు. చోర విద్యలో తన యజమానికి ఇంత నైపుణ్యం ఎలావచ్చిందో వాడు గ్రహించాడు. అయితే, రంగడు తన రహస్యం గ్రహించ లేడనీ, గ్రహించినా వాడి వల్ల తనకు అపాయం జరగదనీ ధారాదత్తుడు నమ్మాడు.

రంగడు అవకాశం దొరికినప్పుడల్లా చోరశాస్త్రం చదువుతూ రాసాగాడు. వాడి ఆలోచనలు పరుగులు తీశాయి. ఒకనాడు వాడు చోరశాస్త్రాన్ని సంగ్రహించి, యజమాని వద్ద నుంచి పారిపోయాడు.

ఇది తెలుసుకుని, ధారాదత్తుడు నివ్వెర పోయాడు. రంగడి లాటి బుద్ధిమంతుడూ,



విశ్వాసపాత్రుడూ ఇలా చెయ్యటం ధారాదత్తుడికి ఆశ్చర్యం కలిగించింది.

ఇది జరిగిన కొద్ది రోజులకే నగరంలో అతి తెలివిగా దొంగతనాలు ఆరంభమయాయి. దొంగ దొరకడు. దొంగతనం జరిగిన వివరాలు వింటూంటే ధారాదత్తుడికి తన గ్రంథంలో ఉన్న వివరాలు జ్ఞాపకం వచ్చాయి. తాను పుస్తకంలో చెప్పిన మెళుకువలన్నీ పాటించి దొంగతనాలు చేస్తున్నది రంగడే నని కూడా స్పష్టమయింది.

నానాటికీ దొంగతనాలు హెచ్చు అవుతున్నాయి. రంగడు ఏ నాడో తన ఇల్లు దోచుకోవటానికి కుడా పథకం వెయ్యక

పోడని ధారాదత్తుడు ఊహించాడు. తన యజమాని దగ్గిర ఎంత ధనం ఉన్నదీ వాడికి తెలిసినట్టు నగరంలో మరెవరికీ తెలీదు. అదీగాక వాడికి ధారాదత్తుడి నిత్య జీవితమూ, ఇల్లూ బాగాతెలుసు.

ఈ ఆలోచనతో ధారాదత్తుడికి మన శ్శాంతి లేకుండా పోయింది. చాలా రోజులు మథనపడి, అతను రంగడు తన ఇంట దొంగతనానికి వస్తే, వాణ్ణి పట్ట టానికి ఒక పథకం వేశాడు.

ఈలోపల నగరంలో దండోరా వేశారు; దొంగను పట్టి ఇచ్చిన వారికి లక్ష రూపాయలు బహుమతి ప్రకటించారు.

ధారాదత్తుడు అనుకున్నట్టే రంగడు ఒక రోజు అతని ఇంటికి దొంగతనానికి వచ్చి, ధారదత్తుడి పన్నాగం మూలంగా పట్టుబడి పోయాడు

ధారాదత్తుడు రంగడితో, ''ఏంరా, చోరశాస్త్రం దొంగిలించిన మాత్రాన నా ఇంటనే దొంగతనం చెయ్యగల నను కున్నావా ? '' అన్నాడు.

''ఆ చోరశాస్త్రాన్ని నమ్మే ఇలాగయాను. ఎందుకీ చోరశాస్త్రం ? '' అంటూ రంగడు తన సంచీలో ఉన్న చోరశాస్త్రాన్ని ధారా దత్తుడి మీదికి గిరవాటువేశాడు.

రంగణ్ణి ఏం చెయ్యాలో ధారాదత్తుడికి తోచలేదు. వాణ్ణి రాజుగారికి పట్టి ఇచ్చి బహుమానం పుచ్చుకోవచ్చు. కాని రంగడు తన గుట్టు బయట పెట్టేస్తాడు. అందుచేత అతను రంగడితో వాత్సల్య పూర్వకంగా, ''రంగా, తప్పుచేస్తే చేశావు. ఇంకెప్పుడూ ఇలా చేయకు. కష్టపడి బతుకు. ఇప్పటికే చాలా డబ్బు దోచు కున్నావు. దానితో ఏ వ్యాపారమన్నా చేసుకో,'' అంటూ రంగణ్ణి వదిలేశాడు.

తరవాత ధారాదత్తుడు ఆలోచించాడు. రంగడు తన ఇల్లు దోస్తాడంటే తన మన శ్శాంతి ఎంతగా పాడయినదీ గుర్తు తెచ్చు కున్నాడు. చోరశాస్త్రం లోకానికి మేలు చేసే వైద్యశాస్త్రంలాటిది కాదు. అందు చేత అతను తన చోరశాస్త్రాన్ని తగల బెట్టేశాడు.





# అనుమానం పెనుభూతం

ఒక ఊళ్ళో దుగ్గిశెట్టి అనే చిల్లర వర్తకుడు ఉండేవాడు. అతను లోభి మాత్రమే కాక, మహా అనుమానం మనిషి. అతనికి పూర్వీకులు ఇచ్చిపోయిన ఇల్లూ, దానిచుట్టూ విశాలమైన ఆవరణా ఉండేది. ఆ ఆవరణలో కూరగాయల తోట వేసి, మరింత డబ్బు సంపాదించాలని అతనికి ఆలోచన వచ్చింది. తోటపని చెయ్యటానికీ, రాత్రివేళల్లో ఇంటికి కాపలా ఉండటానికీ ఒకే మనిషిని పెట్టుకుంటే కలిసి వస్తుందని అతను ఆలోచించాడు.

రెండు పనులూ చెయ్యటానికి నీలకంఠుడు అనే వాడు ఒకడు దొరికాడు. నీలకంఠుడు తోటపనిలో సమర్థుడని త్వరలోనే తేలిపోయింది. అయితే శెట్టికి ఒక అనుమానం వచ్చింది: పగలంతా ఒళ్ళు వంచి ఇంటిపని చేసేవాడు రాత్రి తెల్లవార్లూ మేలుకుని వుండి ఇంటి కాపలా కాస్తాడా?

నీలకంఠుడు రాత్రి కాపలా సరిగా కాస్తున్నాడో, లేదోనని పరీక్షించటానికి శెట్టి ఒకరాత్రి నెత్తిన ముసుగు కప్పుకుని, దొడ్డి తలుపు తెరిచి బయటికి వచ్చాడు. తెరిచినప్పుడు ఆ పాతకాలపు తలుపులు కిర్రుమని చప్పుడు చేశాయి.

ఇంటి ముందు కాపలా కాస్తున్న నీలకంఠుడు ఆ చప్పుడు విని, చేతికర్ర పట్టుకుని, ఇంటి వెనక్కు వెళ్ళి, ఒక ముసుగు మనిషి వంటింటి కేసి పోతూ ఉండటంచూసి, తన కర్ర ఎత్తి ఆ మనిషి బుర్ర పగలగొట్ట బోయాడు.

అంతలో శెట్టి వెనక్కు తిరిగి చూసి, కెవ్వన అరిచాడు.

నీలకంఠుడు తన యజమాని గొంతు గుర్తుపట్టి, "మీరా, బాబుగారూ? ఇంత

వీరేపల్లి జయరాంరెడ్డి

రాత్రివేళ ఇటుగా వచ్చారేం?'' అని అడిగాడు.

''నువు సరిగా కాపలా కాస్తున్నావో, లేదో చూద్దామని వచ్చాలే. ఫరవాలేదు. నిద్ర పోకుండా నీ పని నువు బాగానే చేస్తున్నావు. నేను అప్పుడప్పుడూ నిన్ను పరీక్షించటానికి ఇలా వస్తూంటాను. అందుచేత నువు బుర్ర పగలగొట్టే ముందు ఎవరైనదీ కాస్త చూడు,'' అని చెప్పి శెట్టి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. అలా చెప్పినందువల్ల, ఏ సమయంలో శెట్టి వచ్చి చూస్తాడోనని నీలకంఠుడు మరింత శ్రద్ధగా కాపలా కాస్తాడని శెట్టి ఉద్దేశం.

అయితే ఇదంతా పొంచి ఉన్న ఒక దొంగ చెవినపడింది. వాడు శెట్టి ఇంటి మీద ఒక కన్నువేసి ఉంటున్నాడు, కాని నీలకంఠుడి మూలంగా వాడికి ఏ మాత్రమూ అవకాశం దొరకటం లేదు. అయితే ఇప్పుడు శెట్టి మాటలు విన్నాక వాడికొక ఉపాయం తోచింది. వాడు ఇంచుమించు శెట్టి శరీరంలాటి శరీరం కలవాడే.

ఆ రాత్రికి వాడు వెళ్ళిపోయి, మరుసటి రోజు రాత్రి అదే వేళకు శెట్టి లాగా బట్టలు ధరించి, శెట్టిగారి పెరటి గోడ దూకి, గోడవార చీకటిలో నక్కుతూ, వంటింటి కేసి వెళ్ళాడు. అక్కడ వాడు వంటింటి తాళాన్ని తన దగ్గిర ఉన్న మారు తాళం చెవులతో తీసే ప్రయత్నంలో పడ్డాడు.



కిందటి రోజులాగే నీలకంతుడు ఇంటి వెనక అలికిడి విని, అటుకేసి వచ్చి, వంటింటి తలుపు తెరుస్తున్న దొంగను చూసి, శెట్టి మళ్ళీ తనను పరీక్షించటా నికి వచ్చాడనుకున్నాడు. శెట్టి రోజూ తనను యిలా పరీక్షించటం వాడికి అసహ్యం వేసింది. శెట్టికి మంచిగా బుద్ధి చెప్పాలనుకుని, దొంగ తాళం తీసి వంటింట ప్రవేశించగానే, నీలకంతుడు చప్పుడు చెయ్యకుండా వెళ్ళి, వంటింటి తలుపు మూసి, బయటి నుంచి గడియ పెట్టాడు.

ఈ దెబ్బతో శెట్టికి బుద్ధి వస్తుందనీ, ఇక ఎన్నడూ తనను పరీక్షించటానికి రాడనీ నీలకంతుడు అనుకున్నాడు.

దొంగమాత్రం వంటింట చిక్కి పోయాడు. తాను శెట్టి లాగా వేషం వేసుకున్నా నీలకంతుడు తనను దొంగగా గుర్తుపట్టాడని వాడికి తోచింది. అయినా వాడు వంటిల్లు ఖాళీచేసి, తాను తీసుకు పోదలచుకున్నదంతా మూటకట్టి, బయట పడే అవకాశం కోసం చూడసాగాడు.

ఇంతలో బయటి గడియ ఎవరో మెల్లిగా తీస్తున్నట్టు దొంగకు తెలిసింది. వాడు ఒక గరిట చేత పట్టుకుని తలుపు చాటున నిలబడ్డాడు. ఇంతలో తలుపు తీసి ఎవరో వంటింట్లోకి వచ్చారు. అది ఎవరని చూడక దొంగ ఆ మనిషి నెత్తిన బలంగా కొట్టి, పీక పట్టుకుని, కాళ్ళూ, చేతులూ కట్టి తాను తీసుకుపోయేటందుకు సిద్ధంగా



ఉన్న మూటతో వచ్చిన దారినే గోడదూకి పారిపోయాడు.

తెల్లవారగానే నీలకంఠుడు వంటింటి కేసి వెళ్ళాడు. వంటింటి తలుపు తీసి ఉన్నది. లోపల శెట్టి చేతులూ, కాళ్ళూ కట్టేసి ఉన్నాడు. వంటిల్లు పూర్తిగా ఖాళీ అయి ఉన్నది.

నీలకంఠుడు చప్పున తన యజమాని కట్లు విప్పి, "ఏం జరిగింది?" అని అడిగాడు.

"మొన్న రాత్రి దొడ్డి తలుపు కిర్రు మంటే నువు విని వచ్చావు. దొంగవాడు చప్పుడు చెయ్యకుండా వస్తాడు గద. అందుకని, తలుపు చప్పుడు కాకుండా నూనె వేసి, దొంగవాడు వస్తే నువు తెలుసు కుంటావో, లేదో చూద్దామని, నిన్న రాత్రి బయటికి వచ్చాను. వంటింటి తలుపు గడియపెట్టి ఉన్నది గాని, తాళం తీసి ఉన్నది. అది ఎవరి పనా అనుకుని ఆశ్చర్యపోతూ, గడియతీసి లోపలికి వెళ్ళాను. లోపల ఒక దొంగ వెధవ ఉండనే ఉన్నాడు. వాడు నా మీద హఠాత్తుగా విరుచుకుపడి ఇలా చేశాడు. రాత్రి దొంగ ఇంట్లోపడి దోచేస్తూంటే నువు ఏం చేస్తున్నట్టు?" అని శెట్టి నీలకంఠుణ్ణి అడిగాడు.

శెట్టి అనుకుని తాను వంటింట్లో బంధించినది దొంగేనన్న సంగతి నీల కంఠుడికి తెలిసిపోయింది. కాని వాడు తన పొరపాటు యజమానికి తెలియ నియ్యక, "భలే వారేనే మీరు? రాత్రి ఇంటికి దొంగ రావటం నేను చూడ లేదనుకున్నారా? వాడు గోడ దూకటమూ, వంటింటి తాళం తియ్యటమూ, అంతా గమనిస్తూనే ఉన్నాను. వాణ్ణి లోపలపెట్టి బయట గడియపెట్టినది నేను కాదా? నేను పట్టుకున్న దొంగను మీరు విడి పించింది కాక, నన్నే తప్పు పట్టు తున్నారా?" అన్నాడు.

శెట్టి తెల్లమొహం వేశాడు. అటు తరవాత ఆయన నీలకంఠుణ్ణి ఎన్నడూ పరీక్షించలేదు.





# న్యాయపాలకుడు

పూర్వం వైశాలినగరాన్ని చంద్రసేను డనే రాజు పరిపాలించాడు. ఆయన పాలనలో నిష్పక్షపాతంగా అందరికీ న్యాయం జరిగే దని ప్రతీతి.

ఒకనాడు ఒక అంతఃపుర సేవకుడు రాజుకు వినయంగా ఒక ఫిర్యాదు చేశాడు. ఆస్థానానికి చెందిన ఒక యువకుడు ప్రతిరోజూ చీకటి పడినాక వచ్చి, ఆ సేవకుడి కుమార్తెను తన కిచ్చి పెళ్ళి చెయ్యమని కోరుతున్నాడట; అలా చెయ్యకపోతే అతని కుటుంబాన్ని నాశనం చేస్తానని బెదిరిస్తున్నాడట.

ఈ ఫిర్యాదు విని రాజు, "రేపు కూడా ఆ యువకుడు నీ యింటికి వచ్చి నిన్ను బెదిరిస్తే నాతో చెప్పు," అన్నాడు అంతఃపుర సేవకుడితో.

మర్నాడు సేవకుడు రాజు వద్దకు వచ్చి, ఆ యువకుడు రాత్రి పొద్దుపోయిన తరవాత మళ్ళీ వచ్చి తనను బెదిరించి నట్టు చెప్పాడు.

రాజు ఆ సాయంకాలం చీకటి పడ్డాక మారువేషం ధరించి, సేవకుడి వెంట వాడి ఇంటికి చేరుకున్నాడు. కొద్దిసేపు గడిచాక, సేవకుడు ఆ యువకుడు వస్తున్నట్టు రాజుకు చెప్పాడు. రాజు వెంటనే దీపం ఆర్పేశాడు.

తరవాత ఆ యువకుడు లోపలికి వచ్చాడు. రాజు చీకటిలోనే ఆ యువకుణ్ణి తన ఖడ్గంతో చంపేశాడు. తరవాత ఆయన సేవకుణ్ణి దీపం వెలిగించి పట్టుకు రమ్మన్నాడు.

దీపం వెలుగులో రాజు చనిపోయిన యువకుణ్ణి పరీక్షగా చూసి, "రక్షించావు, దేవుడా!" అన్నాడు.

వెంటనే ఆయన సేవకుడితో, "నీ వంట గది చూపు!" అన్నాడు.

కె. ఎస్. ఎస్. శేషన్

ఇద్దరూ కలిసి వంట గది చేరగానే రాజు, ఆ సేవకుడి కుటుంబం తమ కోసం చేసుకున్న భోజనం తనకు వడ్డించమని చెప్పి, అవురావురని తినేశాడు.

రాజు చర్యలు ఏవీ సేవకుడికి అర్థం కాలేదు. వాడు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. తాను ఫిర్యాదు చేసిన మీదట రాజు స్వయంగా తన ఇంటికి రావడమేమిటి? తనకు అన్యాయం తలపెట్టిన యువకుణ్ణి తానే స్వయంగా చంపడమేమిటి? చంపే ముందు దీపం ఆర్పెయ్యడమేమిటి? వెలుగులో చచ్చిన యువకుణ్ణి చూడగానే దేవుడికి కృతజ్ఞత తెలుపుకోవడమేమిటి? అంతా అయాక తన ఇంటి సామాన్యమైన భోజనం తినటమేమిటి?

ఉండబట్టలేక సేవకుడు రాజును తన అనుమానాలు అడిగాడు.

భోజనం ముగించిన రాజు చేతులు కడుక్కుంటూ సేవకుడి ప్రశ్నలకు ఇలా సమాధానం ఇచ్చాడు:

"రెండు రోజుల క్రితం నువు నాకు ఫిర్యాదు చేసినప్పుడు, నిన్ను బెదిరించ సాహసించిన యువకుడు నా కుమారుడే అయి ఉండవచ్చునని శంకించాను. ఇతరులకు అంత ధైర్యం ఉండదని నా నమ్మకం. ఎవడైనా వాడు చచ్చి తీరాలి. నా కొడుకునే నేను చేజేతులా చంపలేకపోతా నేమోనని దీపం ఆర్పేశాను. అతన్ని చంపిన మీదట ఎవరో చూడటానికి దీపం వెలిగించి తెమ్మన్నాను. వెలుగులో చూడగా అతను నా కుమారుడు కాడు. అందుకే దేవుడికి కృతజ్ఞత తెలుపుకున్నాను. నీ ఫిర్యాదు విన్నది మొదలు నీకు న్యాయం జరిగేవరకూ నేను భోజనం చెయ్యలేదు. ఆ కారణంవల్ల బాగా ఆకలితో ఉండి నేను నీ యింటనే భోజనం చేశాను."

ఇలా చెప్పి రాజు తన భవనానికి వెళ్ళిపోయాడు. రాజు న్యాయనిరతికి సేవకుడి కళ్ళ వెంట ఆనందబాష్పాలు రాలాయి.





# వీర హనుమాన్

హనుమంతుణ్ణి చంపేస్తామని ఆయుధాలు పట్టి లేచి నిలబడిన వికుంభుడు మొదలైన రాక్షసులను కూర్చోమని చెప్పి, విభీషణుడు రావణుడికి నమస్కరించి ఇలా అన్నాడు :

"సామదాన భేదోపాయాలతో సాధ్యం కాని సమయంలోనే దండోపాయాన్ని అవలంబించాలని పెద్దలు చెబుతారు. రాముడి బలాన్ని తక్కువ చేసి చూడ వద్దు. హనుమంతుడు సముద్రం దాటి వచ్చి ఇంత అల్లకల్లోలం చేశాడంటే, దైవం వాళ్ళకు అనుకూలంగా ఉన్నట్టు స్పష్టమవుతున్నది. రాముడు ఖరుడు మొదలైన రాక్షసులను చంపినందుకు ప్రతిక్రియగా రావణుడు సీతను తెచ్చాడని అంటున్నారు. అది సరికాదు. తనను చంపటానికి వచ్చినప్పుడే రాముడు ఆ రాక్షసులను చంపాడు. ఆత్మరక్షణ తప్పుకాదు గదా! మనం సీతను తీసుకువచ్చి ప్రమాదాన్ని తెచ్చుకున్నాము: వైరం కలిగించేది ఎంత మంచిదైతే ఏం లాభం? మనం సీతను రాముడికి ఇచ్చెయ్యాలి. మహాపరాక్రమశాలి అయిన రాముడితో అనవసరంగా వైరం తెచ్చుకోవటం దేనికి? రాముడు లంకానగరాన్ని ముట్టడించక ముందే సీతను ఇయ్యటం మేలు. లేని పక్షంలో లంకకూ, రాక్షసులకూ కూడా చేటు! నేను చెప్పినది నిజమూ, యదార్థమూ కూడానూ. కోపం వల్ల సుఖమూ, ధర్మమూ కూడా

## 19. విభీషణ శరణాగతి



చెడతాయి. నేను చెప్పినట్టు చేస్తే అందరమూ సుఖంగా ఉంటాం.''

విభీషణుడి మాటలు రావణుడికి నచ్చ లేదు. అతను కోపంగా, ''నాకు ఎవరి భయమూలేదు. రాముడు సీతను నా వద్ద నుంచి తీసుకుపోలేడు. దేవేంద్రుణ్ణి తోడు తెచ్చుకున్నా రాముడు యుద్ధంలో నా ముందు నిలవలేడు,'' అన్నాడు.

మర్నాడు రావణుడు యుద్ధతంత్రం గురించి మంత్రులతో ఆలోచించటానికి, రత్నాలంకారాలు గల బంగారు రథం మీద ఆలోచనా మందిరానికి బయలు దేరాడు. అతని వెంట ఆయుధాలు ధరించిన రాక్షసులు నడిచారు. అతను సభకు చేరుతూనే దూతలను పంపి రాక్షసులను పిలిపించాడు. రాక్షసులు వచ్చి ఆసనాల మీదా, దర్భాసనాల మీదా కూర్చున్నారు.

సభ నిశ్శబ్దంగా ఉన్నది. రావణుడు ఏమి చెప్పుతాడోనని అందరూ ఆత్రంగా చూస్తున్నారు. రావణుడు ప్రహస్తుడి కేసి తిరిగి, ''సేనానాయకా, పట్టణాన్ని మరింత శ్రద్ధగా కాపాడటానికి మంచి యోధులను నియమించు,'' అన్నాడు.

ప్రహస్తుడు అప్పటి కప్పుడే పట్టణ రక్షణకు సైన్యాన్ని నియోగించి, ''ఇంకా ఏం చెయ్యమంటారు?'' అని అడిగాడు.

రావణుడు సభను ఉద్దేశించి ఇలా అన్నాడు:

''ధర్మార్థకామాల విషయంలో సంకటం కలిగినప్పుడు మంచి చెడ్డలు గ్రహించడంలో మీరు సమర్థులు. మీరు చేసిన నిర్ణయాలు ఎప్పుడూ మంచి ఫలితాలనే ఇచ్చాయి. నేను చెప్పే విషయం కుంభకర్ణుడికి తప్ప మీకందరికీ తెలిసినదే. అతను గడిచిన ఆరుమాసాలూ నిద్ర పోతూ ఉండి, ఇప్పుడు ఇక్కడికి వచ్చి ఉన్నాడు. నేను దండకారణ్యం నుంచి, రాముడి భార్య అయిన సీతను తెచ్చాను. సీత వంటి సౌందర్యవతి మూడు లోకాల లోనూ లేదు. నేను ఆమెను మోహిం

చాను. కాని అమె నాకు లోబడక నన్ను ఒక సంవత్సరం గడువు అడిగింది. అందుకు నేను సరేనన్నాను. ఈలోగా రాముడు వస్తాడని అమె ఆశకావచ్చు. కాని సముద్రాన్నిదాటి రాముడు ఇక్కడికి ఎలా వస్తాడు? అయితే, ఒకవేళ రామ లక్ష్మణులు దాటి వస్తే ఏం చెయ్యాలి? ఒక్క కోతి వచ్చి ఇంత భీభత్సం చేసి పోయింది గదా! అందుచేత కర్తవ్యం చక్కగా ఆలోచించండి! సముద్రం అవతలి ఒడ్డున రామలక్ష్మణులూ, సుగ్రీవుడు వానరసేనతోనూ ఉన్నారు. సీతను ఇచ్చెయ్యకపోతే మీరు రామలక్ష్మణులను చంపగలరు కదా! వానరసేన సముద్రాన్ని దాటి రాగలదా? అన్నీ ఆలోచించండి.''

రావణు డీ మాటలు అంటే కుంభకర్ణుడికి చాలా కోపం వచ్చింది. అతను రావణుడితో, ''నువు బలాత్కారంగా రాముడి భార్యను తెచ్చేటప్పుడు ఎవరితోనూ ఆలోచించావు కావు. ఇప్పుడు మాతో ఆలోచించే దేమిటి? ఇది చేతులు కాలినాక ఆకులు పట్టుకున్నట్టున్నది. సీతను ఎత్తుకు రావటం ఎంత అపాయకరమో నువు తెలుసుకోలేదు. కాని అదృష్టవశాన రాముడు ఇప్పటి దాకా నిన్ను చంపలేదు. ఇప్పుడు నీ కేమీ



భయం లేదు. నీ శత్రువులందరినీ నేను చంపుతాను. నేను ఇనుపగద తీసుకుని యుద్ధానికి పోతే ఇంద్రుడు కూడా పారిపోవలసిందే! నేను రామలక్ష్మణులను చంపి, వానరులను తినేస్తాను. నువు నిశ్చింతగా ఉండు,'' అన్నాడు.

ఈ మాటలకు రావణుడు అలిగినట్టు మహాపార్శ్వుడికి తోచింది. రావణుడి అలక పోగొట్టటానికి అతను ఇలా అన్నాడు:

''నువు సీతను అనుభవించాలనుకుని శ్రమపడి ఆమెను తెచ్చుకున్నాక, ఊరుకోవటం దేనికి? బలాత్కారంగా నైనా ఆమెను అనుభవించు. నువే అందరినీ ఆజ్ఞాపించగల వాడివి, నిన్ను అడ్డేదెవరు?



అందువల్ల ఏం ప్రమాదం వస్తుందోనని నువు భయపడనవసరం లేదు. ఈ కుంభ కర్ణుడూ, ఇంద్రజిత్తూ ఉండగా ఎవరు యుద్ధానికి వచ్చినా భయం లేదు.''

ఈ మాటకు రావణుడు సంతోషించి, మహాపార్శ్వుడితో, ''ఒక రహస్యం ఉన్నది. వెనక నేనొక పని చేశాను. బ్రహ్మదేవుడి ఇంటికి పోతున్న పుంజికస్థల అనే అప్సరసను చూసి, బలాత్కారంగా ఆమెను అనుభవించాను. పుంజికస్థల ఈ విషయం బ్రహ్మతో చెప్పింది కాబోలు. ఆయన నన్ను హెచ్చరిస్తూ, పరస్త్రీని బలాత్కరిస్తే నా తల నూరు చెక్కలై పోతుందన్నాడు. అందుకే నేను సీతను బలాత్కరించటానికి భయపడుతున్నాను. నాకున్న వేగమూ, గమనమూ తెలియక రాముడు నా మీదికి వస్తున్నాడు. అతను అజ్ఞాని కావటం చేత మృత్యువుతో చెలగాటాలాడుతున్నాడు,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలూ, రావణుడి మాటలూ విన్న మీదట విభీషణుడు, ''రాక్షసరాజా, నువు ఈ సీతను ఎందుకు కోరావు? ఆమె మహాసర్పం. ఆమె రొమ్ముల్లో పడగ ఉన్నది, చింత అనే విషం ఉన్నది, చిరునవ్వులో కోరలు న్నాయి, ఆమె చేతి వేళ్ళు పాముతలలు. వానరయోధులు లంకలో అడుగు పెట్టక ముందే సీతను రాముడికి ఇచ్చెయ్యి. ఈ కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, మహాపార్శ్వుడుగాని, యుద్ధంలో రాముడి ముందు నిలవరు. రాముడు నిన్ను ప్రాణాలతో విడవడు," అన్నాడు.

ప్రహస్తుడు విభీషణుడి మాటలను కొట్టేసి, రావణుడికి ఎవరూ అడ్డులే రన్నాడు. ఇంద్రజిత్తు విభీషణుడికి భయం పట్టుకున్నదని ఆక్షేపించాడు! ''పులస్త్యవంశంలో నీ వంటి పరాక్రమ శూన్యుడు మరొకడు లేడు. రామలక్ష్మ ణులను చంపటానికి రాక్షస వీరులలో ఏ ఒక్కడైనా చాలునే! నువెందుకు భయపడుతున్నావు? ఇంద్రుణ్ణి ఓడించి,

దేవతలను పీడించిన నేను మనుషులను జయించలేనా ?'' అని విభీషణుణ్ణి అడిగాడు.

''నాయనా, నువు చెప్పే మాటలు రాక్షసవంశానికి చేటు తెస్తాయి. రాముడి బాణాల ముందు ఎవరూ నిలవలేరు. అతనికి సీతను ఇచ్చెయ్యటం అన్ని విధాలా మంచిది,'' అన్నాడు విభీషణుడు.

రావణుడు ఇక సహించలేక, విభీషణుణ్ణి నానామాటలూ అని, ''నువు తమ్ముడివి గనక బతికిపోయావు. ఈ మాటలే ఇంకొకడు అన్నట్టుంటే ఆక్షణమే ప్రాణాలు తీసి ఉందును!'' అన్నాడు.



విభీషణుడికి కోపం వచ్చింది. అతను రావణుడితో, "నువు నాకు అన్నవు, తండ్రివంటి వాడివి. నీక్షేమం కోరి చెప్పిన మాటలు నీకు రుచించలేదు. నీకు రుచించే మాటలు చెప్పేవాళ్ళు చాలా మంది ఉంటారు. నేను నీకు కోపం తెప్పించినందుకు క్షమించు. నేను వెళ్ళిపోతున్నాను కనక నువు సుఖంగా ఉండు. నిన్ను నువు రక్షించుకో, ఈ రాక్షసులనూ, లంకాపట్టణాన్నీ రక్షించుకో,'' అన్నాడు.

విభీషణుడు తన గద తీసుకుని మరి నలుగురు రాక్షసులతో సహా ఆకాశంలోకి లేచి, రామలక్ష్మణులున్న చోటికి వచ్చేశాడు. ఆ అయిదుగురూ ఆకాశమార్గాన తమ కేసి వస్తూండటం వానరులకు కనిపించింది. ఆ వచ్చేవాళ్ళు తమ రహస్యాలను తెలుసుకోవటానికో, తమను చంపటానికో వస్తున్నారని సుగ్రీవుడికి అనుమానం కలిగింది. అతను ఆ మాట హనుమంతుడు మొదలైన వాళ్ళతో అనే సరికి, వాళ్ళు చెట్లూ, రాళ్ళూ తీసుకుని, ఆ వచ్చేవాళ్ళను చంపటానికి సుగ్రీవుడి అనుమతి కోరారు.

విభీషణుడూ, అతని వెంట ఉన్న అనలుడూ, శరభుడూ, సంపాతీ, ప్రఘసుడూ అనే రాక్షసులూ, ఆకాశంలోనే నిలిచారు. విభీషణుడు సుగ్రీవుడితోనూ, వానరులతోనూ గట్టిగా ఇలా అన్నాడు:



'' దుర్మార్గుడూ, రాక్షసరాజూ అయిన రావణుడికి నేను తమ్ముణ్ణి. నా పేరు విభీషణుడు. రావణుడు జటాయువును చంపి, జనస్థానం నుంచి సీతను తెచ్చాడు. ఆ సీత ఎంతో దుఃఖిస్తూ, రాక్షసస్త్రీల రక్షణలో ఉన్నది. సీతను రాముడికి ఇచ్చెయ్యమని నేను అతనితో మంచిగా ఎన్నోసార్లు చెప్పాను. విధి తరుముతూ ఉండటం చేత, ఔషధంలాటి నా హితం అతనికి రుచించలేదు. పై పెచ్చు, నన్ను నానామాటలూ అని, సేవకుణ్ణిలా గా అవమానించాడు. అందుచేత నేను భార్యా పుత్రులను విడిచిపెట్టి రాముడి శరణు కోరి వచ్చాను.''

ఈ మాటవిని సుగ్రీవుడు రాముడితో, '' రావణుడి తమ్ముడు, విభీషణు డనే వాడు నలుగురు రాక్షసులను వెంటబెట్టుకుని నీ శరణుకోరి వచ్చాడు. జాగ్రత్త! ఈ రాక్షసులు మాయంకాగలరు; కామరూపులు; శూరులు; జిత్తులలో ఆరితేరిన వాళ్ళు. వాళ్ళను నమ్మరాదు. ఈ విభీషణుడు రావణుడు పంపిన చారుడు కావచ్చు. అతను మనలో వాడుగానే ఉంటూ మన మధ్య విభేదాలు కలిగించవచ్చు; లేదా అవకాశం చూసుకుని మనని చంపవచ్చు. సాక్షాత్తూ రావణుడి తమ్ముడు, శత్రుపక్షం నుంచి వచ్చాడు! ఇతన్ని ఎలా నమ్మటం? ఇతన్నీ, ఇతని నలుగురు అనుచరులనూ చంపెయ్యటమే మంచిది!'' అన్నాడు.

సుగ్రీవుడు చెప్పిన మాటలను విని రాముడు తన సమీపంలో ఉన్న హనుమంతుడు మొదలైన వాళ్ళతో, '' సుగ్రీవుడు బాగా ఆలోచించి చెప్పిన మాటలు విన్నారు కదా. మీకు ఏం తోస్తున్నదో మీరు కూడా చెప్పండి,'' అన్నాడు.

మొదట అంగదుడు ఇలా అన్నాడు: '' ఏమైనా శత్రు పక్షం వాణ్ణి గుడ్డిగా నమ్మరాదు. అందువల్ల చాలా నష్టం ఉంటుంది. ముందు ఈ విభీషణుడి తత్వం తెలుసుకోవాలి.''

"ఇతని దగ్గిరికి వెంటనే ఒక చారుణ్ణి పంపటం, సరిఅయినమార్గంగా తోస్తుంది," అన్నాడు శరభుడు.

జాంబవంతుడు, "నీ శత్రువైన రావణుడి వద్దనుంచి ఈ విభీషణుడు ఇలా వచ్చెయ్యటానికి ఎలాటి కారణమూ కనిపించదు. అతన్ని శంకించక తప్పదు," అన్నాడు.

"మన మనిషి వెళ్ళి విభీషణుణ్ణి రావణాసురుడి వృత్తాంతం ఏమిటని అడిగితే బాగుంటుంది. అతను ఎలాంటి వాడో వెంటనే తెలిసిపోతుంది," అన్నాడు మైందుడు.

హనుమంతుడు ఇలా అన్నాడు:

"విభీషణుణ్ణి పరీక్షించి చేరదీయాలని ఇంతమందీ చెప్పిన మాట నాకు సరిగా కనబడలేదు. అతన్ని చేరదీస్తేనే గాని అతని మంచి చెడ్డలు తెలియవు; మంచి చెడ్డలు తెలుసుకునిగాని మనం అతన్ని చేరదీయరాదు—ఇది ఎలా పరిష్కారం అవుతుంది? ఇక చారుణ్ణి ఎదురుగా ఉన్న వాడి వద్దకు పంపటం అర్థం లేని పని; దూరాన ఉన్నవాడి వద్దకైతే పంపవచ్చు. జాంబవంతుడి మాట కూడా నిజం కాదు. కాలమూ, దేశమూ కలిసి రావటం చేతనే విభీషణుడు వచ్చాడు. నిన్నూ, రావణుణ్ణీ పోల్చి చూచి, రావణుడికి హితం చెప్పి, అతని చేత అవమానం పొంది, అతన్ని విడిచి నీ వద్దకు వచ్చాడు. అతని రాక అకారణం కాదు. మైందుడు చెప్పినట్లు ఎవరైనా వెళ్ళి, రావణుడి సంగతి అడగగానే విభీషణుడు తడుముకోకుండా చెప్పేస్తాడా? విభీషణుడు తాను ఎందుకొచ్చాడో చెప్పాడు. అందులో నాకు తప్పు ఏమీ కనబడలేదు. అతను దొంగలాగా లేడు, నిర్భయంగా ఉన్నాడు. వాలిని చంపి సుగ్రీవుడికి వానరరాజ్యం ఇచ్చినట్టుగానే, రావణుణ్ణి చంపి తనకు లంకారాజ్యం ఇస్తావని ఇతను నీ వద్దకు వచ్చాడని నాకు తోస్తుంది. విభీషణుణ్ణి చేరదీయవచ్చునని నా ఉద్దేశం. తరువాత నీ యిష్టం!"






మంత్రిభి ర్హితసంయుక్తైః, సమర్థైః మంత్రనిర్ణయే,
మిత్రై ర్వాపి, సమానార్థైః, బాంధవై రపి వా హితైః,
సహితో మంత్రయిత్వా యః కర్మారంభాన్ ప్రవర్తయేత్,
దైవే చ కురుతే యత్నం త మాహుః పురుషోత్తమమ్. 1

[ఎవడైతే తన హితం కోరే, సమర్థులైన మంత్రులతో గాని, తన భాగస్వాములతో గాని, తన మేలుకోరే వారితో గాని, స్నేహితులతో గాని, బంధువులతో గాని సమాలోచనచేసి, దైవం మీద భారం వేసి పని ప్రారంభిస్తాడో వాడు ఉత్తముడు.]

ఏకోర్థం విమృశే, దేకో ధర్మే ప్రకురుతే మనః,
ఏకః కార్యాణి కురుతే, త మాహుః మధ్యమం నరమ్. 2

[ఒకే ప్రయోజనం కోసం, ఒకే ధర్మం మనసులో పెట్టుకుని, ఒంటరిగా పనులు చేసేవాడు మధ్యముడు.]

గుణదోషా వనిశ్చిత్య, త్యక్త్వా దైవవ్యపాశ్రయం,
కరిష్యా మీతి యః కార్య ముపేక్షేత్ స నరాధమః. 3

[ఎవడు మంచి చెడ్డలు స్పష్టంగా ఆలోచించకుండా, దైవం అనుకూలించేది కూడా చూడకుండా, చేద్దాం లెమ్మని పనిప్రారంభించి దాన్ని మధ్యలో వదిలేస్తాడో వాడు అధముడు.

మంత్రాలోచనాపరులు .

Photo by M. Krishna Kumar



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎంతెంత దూరం

పంపినవారు :
పి. వి. రామకుమార్

54

Photo by M. Krishna Kumar



బ్రాడీపేట,
గుంటూరు - 2

దగ్గరకు చేరాం

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





* వ్యాఖ్యలు ఏప్రిల్ 20 వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూన్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI


56

మిగతావన్ని
ప్రయత్నించారు
యిప్పుడు
అత్యుత్తమమైనదానిని
రుచి చూడండి

# క్వాలిటీ

విటమిన్లతో కూడిన ప్రశస్తమైన పోషకాహార పదార్థములు. అత్యుత్తమమైన తయారీ పద్ధతి. అందుకే గ్లూకోస్ బిస్కట్లలో ఉత్తమమైనవి క్వాలిటీ.




క్వాలిటీ ఫుడ్ ప్రాడక్ట్స్

క్వాలిటీ అంటే ఉత్తమమైన బిస్కట్లు అన్నమాట

